తీసుకోండి

గెవార్ట్

# గెవాబాక్స్

దాని హైస్పీడ్ షట్టర్ వలన

## స్పష్టమైన ఫాస్ట్-ఏక్షన్ చిత్రములు వస్తాయి!



గెవాబాక్స్‌కు 3 స్పీడ్స్ వున్నాయి-బల్బ్, 1/50వ మరియు 1/100వ సెకండ్! మీకు ఎన్ని అవకాశములున్నాయో చూడండి. పిల్లలు, పెంపుడు జంతువులు, ఆటలోని ముఖ్య దృశ్యములు, పిక్‌నిక్ లేక ఎక్కువ హడావిడిగా నున్న టీ పార్టీని గాని ఫొటోగ్రాఫ్ చెయ్యండి!

ఈ విశేషమైన లక్షణముల వలన గెవాబాక్స్ సర్వోత్తమమైనది.

- దృఢమైన, చక్కటి బోడీ—పూర్తిగా ఉత్కృష్టమైన స్టీల్‌తో తయారు చేయబడినది.
- సరియైన కాంపోజిషన్, శీఘ్రముంగా సులభమైన ఫొటోగ్రాఫం కొరకు, ఉజ్వలమైన, స్పష్టమగు ఐ-లెవెల్ వ్యూ ఫైండర్.
- దూరపు వస్తువుల ఫోకస్ చేసుకునేందుకు (f 11 మరియు f 16) 2 ఎపర్చెర్‌లు.
- అద్భుతమైన దీర్ఘ చతురస్రాకారపు ఛాయా చిత్రములు-6 సెం.మీ. × 9 సెం.మీ. అంత పెద్దవి. ఆ తరగతితో పోల్చదగిన కెమేరాల నుండి వచ్చే వాటి కంటే, ప్రతిది 50% పెద్దది. అత్యంత ఉత్తమమైన ఎన్‌లార్జ్‌మెంట్‌లు లభిస్తాయి.

గెవాబాక్స్‌ను ఉపయోగించడం ఎంతో సులభం కూడా. ఒక సారి క్లిక్ చెయ్యండి-మీ గెవాబాక్స్ మిగిలిన దంతా చేస్తుంది. మీ వర్తకుని చూపించమని అడగండి. ఖరీదు: రూ. 44.00.




గెవార్ట్

# గెవాబాక్స్




ఎల్లయిడ్ ఫొటోగ్రాఫిక్స్ లిమిటెడ్
కస్తూరి బిల్డింగ్, జమ్‌షెడ్జీ టాటా రోడ్,
బొంబాయి-1.

Bensons/I-APL-3 TL



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ సంచికతో "చందమామ" కు ఇరవయ్యో సంవత్సరం ఆరంభమవుతున్నది.

ఈ సంచికలో ప్రచురితమైన బేతాళ కథ "వ్యర్థమైన శక్తులు" బేతాళ పంచవింశతి లోని కథలలో ఒకటి; "కల్పితం" కాదు. అనేక బేతాళ కథలు కొద్ది మార్పులతో మామూలు కథలుగా ప్రచారంలో ఉన్నాయి. వాటిలో ఇది కూడా ఒకటి. అందుచేత పాఠకుల కీ కథ అదివరకే పరిచయమై ఉండవచ్చు.

సంపుటి : 39 జూలై '66 సంచిక : 1

CHITRA



# భారత చరిత్ర



1707 మార్చి 3 న ఔరంగజేబు చని పోయాడు. వెంటనే మొగలుసామ్రాజ్యం విచ్ఛిన్నం కాసాగింది. ఆయన కొడుకులు ముగ్గురూ రాజ్యం కోసం ఒకరినొకరు చంపు కోవటానికి తలపడ్డారు. పెద్దవాడు ముఅజ్జం కాబూలు లోనూ, రెండోవాడు అజం గుజ రాతు లోనూ, మూడోవాడు కామ్‌బక్ష్ బిజా పూరు లోనూ గవర్నర్లుగా ఉంటున్నారు. వీళ్ళు కొట్టుకు చస్తారని ఊహించే ఔరంగ జేబు తన సామ్రాజ్యాన్ని ముగ్గురూ పంచు కోవాలని విల్ రాసిపెట్టాడు. తండ్రి కోరిన ప్రకారం రాజ్యాన్ని పంచుకోవటానికి ముఅజ్జం ఇష్టపడ్డాడు. కాని రెండోవాడు అజం ఒప్పుకోలేదు. 1707 జూనులో వాళ్ళిద్దరూ అగ్రాకు దగ్గిరలో జాజౌ అనే చోట యుద్ధానికి తలపడ్డారు. ఆ యుద్ధంలో అజం ఓడిపోవటమేగాక, ప్రాణాలే పోగొట్టు కున్నాడు. తరవాత కొద్దిరోజుల అనంతరం ముఅజ్జం కామ్‌బక్ష్‌తో కూడా హైదరాబాదు సమీపంలో యుద్ధం చేసి గెలిచాడు. కామ్ బక్ష్ గాయపడి, 1708 లో చనిపోయాడు.

బహదుర్ షా అనే పేరుతో ముఅజ్జం ఢిల్లీ గద్దె ఎక్కాడు. కాని అప్పటికే వయసు చెల్లటంచేత మొగలుసామ్రాజ్య విచ్ఛిత్తిని అతను ఆపలేకపోయాడు. 1712 ఫిబ్రవరి 27 న బహదుర్‌షా చనిపోగానే అతని కొడుకులు నలుగురూ రాజ్యం కోసం మళ్ళీ యుద్ధం చేసుకున్నారు. అందులో మిగిలిన ముగ్గురూ చావగా, పెద్దవాడు జహాందార్‌షా, జుల్‌ఫికర్ ఖాన్ అనేవాడి సహాయంతో గద్దె ఎక్కాడు. జుల్‌ఫికర్‌ఖాన్ అతని ప్రధాన వజీరయాడు.

అయితే జహాందార్‌షా లాల్‌కుమారి అనే ఆడదాని చేతిలో కీలుబొమ్మగా ఉండి, ఆటగాళ్ళనూ, పాటగాళ్ళనూ, నటులనూ స్వైరవిహారం చెయ్యనిచ్చాడు. చివరకతన్ని



అతని తమ్ముడి కొడుకు ఫ్రరుఖ్‌సియర్ అనేవాడు ఢిల్లీ కోటలో గొంతుపిసికి చంపించి, 1713 లో తానే చక్రవర్తి అయి, జుల్‌ఫికర్‌ఖాన్‌ను ఉరితీయించాడు.

ఫ్రరుఖ్‌సియర్ పాదుషా కావటానికి ఇద్దరు సయ్యిద్ సోదరులు, హుసేనాలీ, అబ్దుల్లా అనేవాళ్ళు తోడ్పడ్డారు. ఫ్రరుఖ్ సియర్ వట్టి హీనుడూ, పిరికిపందా. మీర్ జుమ్లా లాటి సయ్యిద్ వ్యతిరేకుల బోధలు విని, సయ్యిద్‌సోదరుల పట్ల కృతఘ్నుడుగా ప్రవర్తించి, వాళ్ళచేత కళ్ళు పీకించుకుని, దారుణ దుర్మరణం పాలయాడు.

తరవాత సయ్యిద్ సోదరులు నామ మాత్రపు చక్రవర్తులను సింహాసనం మీద ఎక్కించి తామే రాజ్యమేలుతూవచ్చారు. వారి సహాయంతో సింహాసనమెక్కిన వారిలో బహదుర్‌షా నాలుగో కొడుక్కు కొడుకైన రోషన్‌అఖ్తర్ అనేవాడు సయ్యిద్ సోదరులకు ఎదురుతిరిగాడు. ఇతను ముహమ్మద్‌షా అనే పేరుతో చక్రవర్తి అయి, దక్కను నవాబైన నిజాముల్ ముల్క్ సహకారం సంపాదించి, కాలక్రమాన ఇద్దరు సయ్యిద్‌లనూ కడతేర్చాడు.

ముహమ్మద్‌షా చాలాకాలం పాలించాడు గాని, సామ్రాజ్య విచ్ఛిత్తిని అరికట్టే దక్షత



అతనిలో లేకపోయింది. దక్కనూ, ఔధూ, బెంగాలూ సామ్రాజ్యాధికారం కిందినుంచి వైదొలగిపోయాయి. మహారాష్ట్రులూ, ఆగ్రా ప్రాంతంలో ఉండే జాట్‌లూ, పంజాబులో సిక్కులూ, తదితరులూ సర్వస్వతంత్రులుగా వ్యవహరించారు. గోరుచుట్టుపై రోకటి పోటులాగా, నాదిర్‌షా దాడితో ఢిల్లీ సామ్రాజ్యం చావుదెబ్బ తిన్నది. ఔరంగజేబు చనిపోయిన మూడు దశాబ్దాల కాలంలో యావద్భారతస్థాయిన మొగలు సామ్రాజ్యమన్నది లేకుండాపోయింది.

నాదిర్‌షా పర్షియా నుంచి భారతదేశం పైకి దండెత్తి వచ్చాడు. అతన్ని ప్రతిఘ

టించటానికి కాబూలు, పంజాబుల గవర్నర్లు ప్రయత్నించి విఫలులై, సైన్యాలను సహాయం పంపమని ఢిల్లీకి కబురు చేశారు. ఢిల్లీలో పదవుల కీచులాటల వల్ల వారి మొర ఆలకించినవారు లేకపోయారు.

నాదిర్‌షా ఆరంభంలో ఒక దొంగల ముఠాకు నాయకుడు. అతను కష్టాలనుభవించి శౌర్యపరాక్రమాలు అలవరచుకున్నాడు. అఫ్ఘానుల నుంచి అతను పర్షియాను కాపాడాడు. అటుతరవాత కొంత కాలానికతను పర్షియాకు రాజే అయాడు. 1738 లో అతను భారతదేశంపైకి బయలుదేరి, 1739 కల్లా ఘజ్నీ, కాబూలూ, లాహోరూ పట్టుకున్నాడు. అంత అయినా ఢిల్లీ దర్బారులో చైతన్యం కలగలేదు. నాదిర్‌షా సేనలు ఢిల్లీకి కొద్ది మైళ్ళలోకి వచ్చాకనే వారు మేలుకున్నారు. 1739 ఫిబ్రవరిలో మొగలు సైన్యాలకూ పర్షియా సైన్యాలకూ యుద్ధం జరిగింది. పాదుషా ఓడిపోయి, సంధిబేరానికి దిగాడు. నాదిర్‌షా, పాదుషాతో సహా రాజభవనానికి వచ్చాడు.

మొదట్లో ఢిల్లీ ప్రశాంతంగానే ఉన్నది. కాని ఎవడో, నాదిర్‌షా చచ్చినట్టు పుకారు లేపాడు. ఢిల్లీ పౌరులు పర్షియను సైనికులను కొందరిని చంపారు. నాదిర్‌షా ఉగ్రుడై ఢిల్లీపౌరులను చిత్రవధ చెయ్యమని ఉత్తరువిచ్చాడు. ఉదయం 8 లగాయతు అపరాహ్నం 3 గంటల దాకా నరవధ సాగిందట. స్త్రీలను బానిసలుగా పట్టుకున్నారు. ఇళ్ళు తగలబెట్టారు. చచ్చినవారినీ, గాయపడినవారినీ, హిందువులనూ, మహమ్మదీయులనూ కలగలిపి దహనంచేశారు. ఢిల్లీ పౌరుల వద్దనుంచి మూడుకోట్ల రూపాయలు దౌర్జన్యంగా వసూలు చేయబడ్డాయి.

నాదిర్‌షా కోహినూర్‌వజ్రాన్నీ, నెమలి సింహాసనాన్నీ తీసుకుని, ఖజానాను తుడిచిపెట్టి మరీ వెళ్ళాడు. సింధునదికి అవతల ఉన్న ప్రాంతాలు పర్షియనులకు పోయాయి.



# నేహ్రూ కథ

## 25



అఖిలపక్ష సమావేశంవారు రాజ్యాంగాన్ని తయారుచెయ్యటం తేలికగానే తయారు చేశారు. పార్లమెంటరీ విధానమూ, ప్రజాతంత్రమూ యొక్క మూల సూత్రాలు అందరికీ తెలిసినవే గనక చిక్కు లేక పోయింది. అయితే మతవర్గాల సమస్యా, అల్పసంఖ్యాకవర్గాల సమస్యా వచ్చేసరికి అది గడ్డుసమస్య అయి కూర్చున్నది. అది తేలేమార్గం కనబడక, మోతీలాలును అధ్యక్షుడుగాపెట్టి, తేజ్‌బహదూర్‌సప్రూ లాటివారిని సభ్యులుగా ఉంచి ఒక కమిటీని వేశారు. ఆ కమిటీకి నెహ్రూకమిటీ అనీ, వారు చేసిన రిపోర్టుకు నెహ్రూరిపోర్టు అనీ పేర్లు వచ్చాయి.

జవాహరు ఆ కమిటీలో సభ్యుడు కాక పోయినా, కాంగ్రెసు కార్యదర్శిగా దానితో సంబంధం పెట్టుకోవలసి వచ్చింది. అందు వల్ల అతను కొంత చిక్కునపడ్డాడు. అసలు సమస్య అధికారం హస్తగతం చేసుకోవటం అయి ఉండగా, రాజ్యాంగ వివరాలు చిత్తరాయటం శుష్కదండగ అని అతని నమ్మకం. అంతేగాక, కమిటీలో నానారకాల వాళ్ళున్నారు.

నెహ్రూ రిపోర్టు తయారయింది. దాన్ని చర్చించటానికి అఖిలపక్ష సమావేశం లక్నోలో జరిగింది. సంపూర్ణస్వాతంత్ర్యానికి తక్కువైతే ఆమోదించలేని జవాహరులాటి వారు చిక్కులోపడ్డారు. రిపోర్టులో సంపూర్ణ స్వాతంత్ర్యానికి విరుద్ధమైన అంశాలున్నాయి. వాటిని తీవ్రంగా విమర్శిస్తే మతవర్గ సామరస్యానికి జరిగే కృషి దెబ్బతినవచ్చు.

అఖిలపక్ష సమావేశం ఎస్టేటులవారి హక్కులకు హామీ ఇస్తూ, వారి ఆస్తి హక్కుల ప్రాతిపదికపైన ఏర్పడిన రాజ్యాంగాన్ని ఆమోదించింది. ఇది జవాహరు సహించలేకపోయాడు. కాంగ్రెసునాయకులు



కూడా, కాంగ్రెసేతరులలాగే, ధనస్వాములతో చేతులు కలపడమూ, తమతోటి సాంఘికాభ్యుదయవాదులను తృణీకరించటమూ నచ్చక, జవాహరు తన కాంగ్రెసు కార్యదర్శి పదవికి రాజీనామా ఇచ్చేశాడు. ఇదే కారణం చెప్పి సుభాస్‌బోసు కూడా రాజీనామా పెట్టేశాడు. కాని వర్కింగు కమిటీవారు జవాహరు చేత ఆ రాజీనామా ఉపసంహరింపజేశారు.

ఈలోపుగా సైమన్‌కమిషనువారు దేశపర్యటన చేస్తూ, నల్ల జెండాలనూ, "తిరిగి పొండి" అన్న నినాదాన్నీ ఎదుర్కొంటున్నారు. అక్కడక్కడా పోలీసులకూ, గుంపులకూ మధ్య ఘర్షణలు కూడా జరిగాయి. కాని ఆకస్మికంగా లాహోరు సంఘటనతో దేశమంతా అట్టుడికిపోయింది. లాహోరులో జరిగిన సైమను కమిషను వ్యతిరేక ప్రదర్శనల సందర్భంలో ఒక ఇంగ్లీషు పోలీసు అధికారి లాలాలజ్పత్‌రాయిని తీవ్రంగా కొట్టాడు: రోడ్డు పక్కన కొన్నివేల ప్రదర్శకుల శిరోభాగాన లజ్పత్‌రాయ్ నిలబడి ఉన్నాడు. ఆయనగాని ఆయన వెనక ఉండిన ప్రజలుగాని ఎలాటి తీవ్రచర్యలకూ దిగక, ప్రశాంతంగా ఉన్నారు. అలాటి లజ్పత్‌రాయినీ, ఆయన అనుచరులనూ పోలీసులు చాలా తీవ్రంగా కొట్టారు. ప్రదర్శకులకూ పోలీసులకూ ఘర్షణ ఏర్పడినప్పుడు పోలీసు లాఠీ దెబ్బలు తగలటం విడ్డూరమేమీకాదు. కాని లజ్పత్‌రాయ్ సందర్భంలో పోలీసు ప్రవర్తన పూర్తిగా పైశాచికంగా కనబడి, అసంఖ్యాకులైన భారతీయులను కలవరపెట్టింది. అంతటి మహానాయకుడికే అలాటి గతి పట్టటంతో ఆగ్రహావేశం కలిగింది.

లజ్పత్‌రాయి చాలా కాలంగా గుండె జబ్బుతో బాధపడుతూ ఉండటంచేతా, వయసుమళ్ళినవాడు కావటంచేతా ఆయన తిన్న దెబ్బలు ప్రమాదకరమైనవి. తరవాత

కొద్ది వారాలకే ఆయన చనిపోయినప్పుడు, డాక్టర్లు దెబ్బల వల్ల మరణం మరింత శీఘ్రంగా కలిగిందన్నారు. లజపత్‌రాయి పైన అత్యాచారం జరిగినట్టే దేశం భావించింది. దేశానికే అత్యాచారం జరిగినట్టయింది. అందుకు పగ తీర్చుకున్నవాడు భగత్సింగు. అందుకే భగత్సింగును దేశం మామూలు టెర్రరిస్టును చూసినట్టు చూడలేదు. అతని పైన పాటలుకట్టారు, అతని పేరు వాడ వాడలా మారుమోగింది.




లజపత్‌రాయిని పోలీసులు కొట్టటమూ, దరిమిలా ఆయన మరణించటమూ జరిగాక సైమన్ కమిషను వెళ్ళినచోటనల్లా నిరసన ప్రదర్శనలు మరింత తీవ్రమయాయి. సైమన్ కమిషను లక్నో రాబోతున్నది. స్థానిక కాంగ్రెసు కమిటీవారు చాలా రోజులు ముందుగానే, బ్రహ్మాండమైన ఊరేగింపులూ, ప్రదర్శనలూ జరిపే సన్నాహాలు చేశారు.

జవాహరు లక్నో వెళ్ళి రిహర్సలు రూపంలో జరిగే ఈ ప్రదర్శనలను స్వయంగా చూశాడు. అవి చాలా పెద్ద ఎత్తున, అతి ప్రశాంతంగా, ఎంతో విజయ వంతంగా జరిగాయి. అది చూసి అధికారు లకు కన్నెర్రనై, కొన్నికొన్ని ప్రాంతాలలో ఊరేగింపులు జరగరాదని ఉత్తరువులు జారీ చేసి, నిరోధక చర్యలు అవలంబించారు. అందుకు వారు పైకిచెప్పిన సాకు వాహనాల రాకపోకలకు అవాంతరం కలుగుతుందని.

ఈ నెపానికి అవకాశంలేకుండా కాంగ్రెసు కార్యకర్తలు ఊరేగింపును చిన్న చిన్న ముఠాలుగా, ముఠాకు పదహారేసి మంది చొప్పున ఏర్పాటుచేసి, ఈ ముఠాలను సమావేశస్థలానికి బయలుదేరదీశారు. జవాహరు ఒక ముఠాను వెంటబెట్టుకుని బయలుదేరాడు.

రోడ్డు నిర్మానుష్యంగా ఉన్నది. జవాహరు ముఠా ఒక ఫర్లాంగుదూరం వెళ్ళిందో లేదో, రెండు మూడు డజన్లమంది పోలీసులు

గుర్రాలెక్కి అతివేగంగా వెనకనుంచి వచ్చి పడ్డారు. వారి తాకిడితో ముఠా ఛిన్నాభిన్న మయింది. వాలంటీర్లు రోడ్డు పక్కలకూ, కొందరు దుకాణాలలోకి సైతం వెళ్ళారు. పోలీసులు వాళ్ళను వెన్నంటి బేటనులతో చావమోదారు.

జవాహరుకు కూడా ఎటైనా వెళ్ళి ఆత్మ రక్షణ చేసుకోవాలనిపించింది. కాని ఎందు చేతనో అతను ఉన్నచోటి నుంచి కదల లేదు. మొదటి పోలీసు తాకిడిని అతను తప్పించుకున్నాడు. అతను రోడ్డు మధ్య ఒంటరిగా నిలబడి, అన్నిపక్కలా తన అనుచరులు పోలీసులచేత దెబ్బలు తింటూండటం చూశాడు. అప్రయత్నంగా అతను రోడ్డుపక్క కేసి నడవసాగాడుగాని, అభిమానం వచ్చి తనను తాను నిగ్రహించు కుని మళ్ళీ ఆగిపోయాడు. ఆ క్షణంలోనే ఒక పోలీసు, చేతిలో కర్రను తిప్పుకుంటూ, గుర్రం మీద తన వేపు రావటం అతనికి కనిపించింది. అతను, "కానీ," అంటూ తన తలను పక్కకు తిప్పుకున్నాడు. పోలీసు వాడు అతని వీపు మీద గట్టిగా రెండు దెబ్బలు వేశాడు. అతను దిమ్మరపోయాడు, అతని శరీరమంతా కంపించింది, కాని తానింకా పడిపోకుండా నిలబడ గలిగి నందుకు సంతృప్తి, సంతోషమూ కలిగాయి.

తరవాత పోలీసులందరూ ఏకమై కాంగ్రెసువాళ్ళు ముందుకు వెళ్ళటానికి వీలు లేకుండా రోడ్డుకు అడ్డంగా నిలబడ్డారు. వాలంటీర్లందరూ ఒక చోటికి చేరి పోలీసుల కెదురుగా రోడ్డు మీద చతికిలబడ్డారు. కొంద రికి తలలు పగిలి ఉన్నాయి. చాలామందికి రక్తం కారుతున్నది. ఒక గంట గడిచింది. చీకటిపడింది. చిట్టచివరకు అధికార్లు వాలం టీర్లను తాము వెళ్ళదలచిన మార్గాన వెళ్ళ నివ్వటమేగాక, వాళ్ళను చావబాదిన పోలీ సులే ముందు నడుస్తూ వాళ్ళను వెంట బెట్టుకు వెళ్ళారు.






# పాతాళదుర్గం

## 3

[కదంబరాజదూతలు నలుగురూ, ఇద్దరు ఖైదీలను వెంటబెట్టుకు వచ్చి, కుంతలదేశ రాజుతో, వాళ్ళే అరణ్యంలో మంత్రికుమారుణ్ణీ అతడి మిత్రులనూ చంపిన వాళ్ళని చెప్పారు. తరవాత దూతలు తమ దేశానికి పోతూండగా కుంతలసైనికులు వాళ్ళల్లో ఇద్దరి మెడలకు ఉరితాళ్ళు తగిలించి, ఖైదీలను విడిపించారు. తరవాత—]

కదంబరాజదూత లిద్దరూ తమ గుర్రాలతో కొండవాగు దాటి, తమ రాజ్యంలో ప్రవేశించారు. కుంతలసైనికులు వదిలిన బాణా లేవీ వారికి తగలలేదు. అర్ధరాత్రి, గుడ్డి వెన్నెల, అరణ్యప్రదేశం. ఆ కారణం వల్ల సైనికులు దూతల మీదికి గురిచూసి బాణాలు వదలలేకపోయారు.

"వాగు దాటి ఆ దూతల వెంట పడటంలో ప్రమాదం ఉన్నది. వాళ్ళకు కదంబరాజ్య సరిహద్దు కాపలా వాళ్ళు సహాయంగా రావచ్చు. ఏమైనా ఆ ఇద్దర్నీ ప్రాణాలతో పోనివ్వకూడదు. మీలో ఎవరు శత్రు రాజ్యంలో జొరబడి, వాళ్ళను వేటాడ గలరో చెప్పండి. వాళ్ళను చంపిన వాళ్ళకు మంత్రిగారు పెద్ద బహుమానం యిస్తారు," అన్నాడు కుంతలసైనికుల నాయకుడు.

ఆ మాట వింటూనే ధూమకుడు ముందుకు వచ్చి, "అయ్యా, నేనూ,





సోమకుడూ ఆ పని చేయగలం. మాకు బహుమానా లేవీ అవసరం లేదు. ఆ దూతల్నే కాకుండా కదంబరాజునూ, మంత్రినీ కూడా మేము చంపి తీరతాం. ఆ దుర్మార్గులు చెప్పినట్టు మేము పితృ, భ్రాతృ హంతకులమేం కాదు. శిస్తు భారం మోయలేక ఉగ్రసేనరాజుకు ఎదురుతిరిగిన గ్రామస్తులం," అన్నాడు.

"మా మంత్రిగారికి మీరు హంతకులు కాదన్న అనుమానం కలిగే, మిమ్మలను బంధవిముక్తుల్ని చేయమని, నాకు ఆజ్ఞ ఇచ్చారు. సరే, మాటలతో కాలయాపన అయిపోతున్నది. ఈ రెండు గుర్రాలూ, ఈ కత్తులూ తీసుకుని వేట ప్రారంభించండి. బహుమానం కావలిసివస్తే మాత్రం, ఆ దూతల శిరస్సులు మా మంత్రిగారి దగ్గిరకు తీసుకురావలసి వుంటుంది," అన్నాడు సైనికులనాయకుడు.

ఆ వెంటనే ధూమక సోమకులు, సైనికులిచ్చిన కత్తులు తీసుకుని, గుర్రాలెక్కి దూతలు వాగు దాటిన ప్రదేశంలోనే తామూ వాగు దాటి, వాళ్ళను వెతుకుతూ కదంబ నగరం కేసి బయలుదేరారు. ఆ ప్రదేశమంతా కొండమయం. మహావృక్షాలతో, ముళ్ళపొదలతో ఆ ప్రాంతమంతా, చీకటిలో మహాభయంకరంగా వున్నది. అడవి మృగాలు నీటి మడుగుల దగ్గిరకు రాకపోకలు జరిపే కాలిబాటల వెంట, జాగ్రత్తగా తమ గుర్రాలను నడుపుతూ, ఎక్కడైనా అలికిడి అయిన జాడ కోసం చెవులు రిక్కించి వింటూ ధూమకసోమకులు అరణ్యంలో చాలా దూరం వెళ్ళారు. కాని, వాళ్ళకు దూతల జాడ కనిపించలేదు.

"సోమూ! ఈ చీకట్లో ఆ దుర్మార్గుల్ని వెతికిపట్టటం అయేపని కాదు. ముందు మన గ్రామం వెళ్ళి మన కుటుంబాలను సరిహద్దులు దాటించి కుంతలరాజ్యం చేరుద్దాం," అన్నాడు ధూమకుడు.





సోమకుడు అడ్డంగా తలాడించి, "ఉగ్ర సేనరాజు చావు చూడందే, నేను గ్రామం రాను. పన్ను కట్టలేసంత మాత్రాన నన్ను ఖైదు చేసి, నానా హింసలకూ గురిచేస్తాడా? పైగా నేను భాతృహంతకుణ్ణా!" అన్నాడు రోషంగా.

"నీ మొండితనం మాను, సోమూ! రాజు అంత తేలిగ్గా మన చేతికి చిక్కుతా డనుకున్నావా? అతడి చుట్టూ ఎంతమంది అంగరక్షకులుంటారో తెలుసా? నేనూ నీతో పాటు హింసలపాలయిన వాణ్ణే. పారిపోయిన ఇద్దరు దూతలూ మన మీద రాజుకు కొండేలు చెప్పి, ఉరితీత పడిన దూతల చావుకు మనమే కారణం అని అయన చేత నమ్మిస్తారు. అప్పుడు మన కుటుంబాల గతి ఏమవుతుందో ఆలోచించావా?" అన్నాడు ధూమకుడు.

ఆ మాటలతో సోమకుడు కొంచెం మెత్త బడ్డాడు. అతడికి ముందు తమ కుటుం బాల రక్షణ విషయం జాగ్రత్త పడటం మేలనిపించింది. "సరే, నువ్వు చెప్పినట్టే చేద్దాం, పద!" అంటూ సోమకుడు గుర్రాన్ని మరొక దారికి మళ్ళించాడు.

ధూమకుడు కూడా తన గుర్రాన్ని మళ్ళించబోయేంతలో, నగరం వైపు నుంచి



పెద్ద వెలుగు కనిపించింది. ఇద్దరూ ఆశ్చర్య పడుతూ అటు కేసి తలలు తిప్పారు. కోట గోడల మీది నుంచి మండుతున్న బాణాలు అరణ్యం కేసి వచ్చి పడుతున్నవి. నగారా మోతలూ, భేరీభాంకార ధ్వనులూ ఒక్కుమ్మడిగా దిక్కులను పిక్కటిల్ల చేస్తున్నవి.

"నగరాన్ని మనవాళ్ళు ముట్టడించారు. రాజు హతం! మనం కూడా వెళ్ళి నగరం మీద పడదాం," అంటూ సోమకుడు గుర్రాన్ని పక్కకు తిప్పాడు.

ధూమకుడు అతణ్ణి వారిస్తూ, "తొందర పడకు. కదంబనగరాన్ని ముట్టడించగల



శక్తి మన పేద గ్రామీణుల కెక్కడ వున్నది? మనం గుడ్డిగా నగరాని కేసి పరిగెత్తితే, మళ్ళీ రాజుకు ఖైదీలుగా చిక్కుతాం. కాలిబాటలు వదిలి, జాగ్రత్తగా చెట్ల మాటున ముందుకుపోయి, ఆ రణగొణ ధ్వనికీ, మంటల బాణాలకూ కారణం ఏమిటో తెలుసుకుందాం," అన్నాడు ధూమకుడు.

కదంబనగరంలో రేగిన కల్లోలానికి కారణం, సోమకు డనుకున్నట్టు పన్నుల భారం మోయలేని గ్రామీణులు చేసిన దాడి కాదు. ఆ రోజు—సరిగా అర్ధరాత్రివేళ ఒక మహాకాయుడు, కోట చుట్టూ వున్న అగడ్తను నాలుగైదు అంగల్లో దాటి, మూసి వున్న నగరద్వారాలను బలంగా తట్టాడు.

"ఎవడు వాడు? బుద్ధిలేదా! సూర్యోదయం అయితేగాని ద్వారాలు తెరవబడవు!" అంటూ ద్వారరక్షకులు కేకవేశారు.

"నే నెవణ్ణా? రాజాధిరాజును!" అంటూ మహాకాయుడు ఒక్క ముష్టిఘాతంతో తలుపులను ఫెళఫెళమంటూ వెనక్కు విరుచుకు పడేలా చేశాడు. ద్వారరక్షకుల్లో కొందరు వాటి కింద చిక్కుకుపోయారు. మిగిలినవారు విరిగిన ద్వారం నుంచి లోపల ప్రవేశించిన నల్లని పర్వతాకారుణ్ణి చూసి భయకంపితులై మూర్ఛపోయారు.

"మీ రిలాగే చచ్చినట్టు పడివున్నారో, చచ్చిన వాళ్ళు చావగా మిగిలిన వాళ్ళయినా బతుకుతారు. అలా కాక, కోటలోకి పరిగెత్తి హెచ్చరికలు చేశారో, మెడలు విరిచేస్తాను," అన్నాడు మహాకాయుడు.

ఆ మాటలతో ప్రాణభయం పోయిన ద్వారరక్షకుల్లో కొందరు అతడి కేసి చూశారు. ఆ మహాకాయుడు చర్మాలు ధరించి వున్నాడు. కళ్ళు నిప్పుకణాల్లా మెరుస్తున్నవి. తల మీద మెలికలు తిరిగిన రెండు కొమ్ము లున్నవి. చేతిలో ముళ్ళు చెక్కిన పెద్ద రాతిగద లాంటిది వున్నది.



"రాక్షస దొరా! నువ్వేలోకం వాడివో మాకు తెలీదు. నగరంలో నీ ఇష్టంవచ్చిన వాళ్ళను తినెయ్యండి. కాని, అదుగో, ఆ రాజమార్గానికి ఎడమవైపు నున్న ఎర్ర చారలగోడ ఇంటివాళ్ళను మాత్రం ఏమీ చెయ్యకండి. ఆ ఇంట్లో నా పెళ్ళాంబిడ్డ లున్నారు," అన్నా డొక ద్వారరక్షకుడు.



రాక్షసుడు ఫిరగబడి నవ్వాడు. "ఒరే మూర్ఖా! నేను మనుషుల్ని తినేందుకు మరో లోకం నుంచి వచ్చిన రాక్షసు ల్లనుకున్నావా? నే నిక్కడివాణ్ణే, దండకారణ్యం వాణ్ణి! మానవుల్తో మా రాజుగారికి వియ్యమందాలని బుద్ధి పుట్టింది. మీ రాజుకూతురు మహా చక్కని చుక్కటే!" అంటూ రాక్షసుడు, నిశ్శబ్దంగా రాజభవనం కేసి నడిచిపోయాడు.

భవన ప్రధానద్వారం వద్ద కాపలావాళ్ళిద్దరు చురుగ్గా పహరా తిరుగుతున్నారు. మరి నలుగురు ఒక నెగడు చుట్టూ కూర్చుని కబుర్లాడుతున్నారు. రాక్షసుడు వాళ్ళ కెదురుగా బాట కవతల వున్న ఒక వృక్షం కింది చీకటిలో కొద్దిసేపు నిలబడి, ద్వారం కేసి బయలుదేరిన వాడల్లా అంతలోనే ఆగి, మరి కొంత దూరం చెట్ల కింది చీకటిలో నడిచిపోయి, భవనప్రాకారాన్ని సమీపించి, దాని మీదిగా లోపలికి దూకాడు. అలా దూకటంలో అతడి కాలొకటి ప్రాకారానికి తగిలి, పెద్ద శబ్దంతో అందులోని కొంత భాగం విరిగి కిందపడింది.

ఆ వెంటనే భవనంలో గొప్ప సంచలనం బయలుదేరింది. "శత్రుసైన్యాలు! శత్రుసైన్యాలు!" అంటూ కొందరు కేకలు పెట్టారు. "భూకంపం! భూకంపం!" అంటూ మరికొందరు భయంతో అరిచారు. రాజప్రాసాదం లోని నౌకర్లూ చాకర్లూ అందరూ కిందికి పరిగెత్తుకుంటూ వచ్చి, కూలిపోయిన ప్రాకారపు గోడను చూసి ఆశ్చర్యపడసాగారు.







ప్రాకారం దగ్గిరకు వెళ్ళిపోయారు. రాక్షసుడు మెట్లెక్కి పై భాగానికి వెళుతుండగా, అతడి తల నీడ ముందుగా రాజకుమార్తె వున్న చోట పడింది. దాన్ని చూస్తూనే కాంతిసేన అదిరిపడింది. చెలికత్తెలు భయకంపితులై నీడ, పై నుంచి పడుతున్నదేమో అనుకుని ఆకాశం కేసి చూశారు. అంతలో రాక్షసుడు ఆఖరు మెట్టెక్కి, పై అంతస్తు చేరి చిన్నగొంతుతో, "నేను మీ కెవరికీ హాని చేయను. అయినా, మీలో ఎవరైనా మూర్ఛ పోదలిస్తే, పొండి. కాని, కేకలు పెట్టి గొడవచేశారో, గొంతులు పిసికేస్తాను," అన్నాడు.

రాజకుమార్తె కాంతిసేనకు భవసంలో రేగిన గగ్గోలుకు నిద్రాభంగమై, తన గది నుంచి బయటికి వచ్చి, పిట్టగోడ నానుకుని నిలబడి కిందికి చూడసాగింది. ఆమె చెలికత్తె లిద్దరు ఆమె పక్కన చేరి, "ఎంత పెద్ద ధ్వనయింది! అందరం భూకంపం వచ్చిందనుకున్నాం," అంటూ కళ్ళింత చేసి, చేతులు వూపుతూ, ఆమెకు కూలిన గోడ చూపసాగారు.

రాక్షసుడు నిశ్శబ్దంగా మెట్లెక్కి రాజకుమార్తె వున్న రెండో అంతస్తుకు పోయాడు. దారిలో అతడికి నౌకర్లెవరూ ఎదురవలేదు. వాళ్ళందరూ కాగడాలు వెలిగించుకుని,

రాజకుమార్తె భయకంపితురాలై, మూర్ఛపోయింది. చెలికత్తె లామెను కింద పడిపోకుండా చేతులతో అదుకున్నారు. రాక్షసుడు వాళ్ళను సమీపించి, కాంతిసేనను మృదువుగా పట్టుకుని పై కెత్తి భుజాన వేసుకుని, చెలికత్తెలతో, "అందంలో మీరు రాజకుమార్తె కేమీ తీసిపోరు. నా వెంట వస్తారా? శౌర్యసాహసాలు గల మా యువకుల్ని చేసుకుందురుగాని. వాళ్ళ అందచందాల మాట మాత్రం అడగవలిసిన పని లేదు. నన్ను చూశారుగదా? నా అంత చక్కగానూ వుంటారు," అన్నాడు.





చెలికత్తె లా మాటలు వింటూనే కూడబలుక్కున్నట్టు, ఒక్కసారిగా మూర్ఛపోయారు. రాక్షసుడు, కాంతిసేనతో మెట్లు దిగివచ్చి, యీ సారి ప్రాకారంగోడ ఎక్కడ దాటటమా అని ఆలోచించేంతలో, రాజుగారి నౌకరొకడు అటుగా వచ్చి, అతణ్ణి చూసి, "రాక్షసుడు! రాజకుమారి నెత్తుకుపోతున్నాడు!" అంటూ కేకపెట్టాడు.

రాక్షసుడు చప్పున ఉద్యానవనం కేసి పరిగెత్తి, అక్కడ చెట్ల చాటున నిలబడ్డాడు. అతడికి రాజసేవకుల్లో ఎవర్నీ చంపటమూ యిష్టం లేదు. రాజకుమార్తెను సురక్షితంగా ఎత్తుకుపోవటం ఒక్కటే అతడు కోరుతున్నది. ఆ కారణంగా, అతడు కాగడాలూ, కత్తులూ తీసుకుని ఉద్యానవనం లోకి వస్తున్న రాజభటుల మీదికి పోకుండా, గోడ దూకి, నగరద్వారాల కేసి పరిగెత్తాడు.

ఆ సరికి రాజు ఉగ్రసేనుడూ, మంత్రీ నిద్ర మేలుకుని, మేడ పై భాగానికి వచ్చారు. ఉగ్రసేనుడికి పారిపోతున్న రాక్షసుడి భుజం మీద తన కుమార్తె కనిపించింది. భటులు కొందరు రాక్షసుడి మీదికి గురిచేసి బాణాలు వదులుతున్నారు. వాటిల్లో ఒకటీ అరా వచ్చి తగిలినా, అతడేమీ లెక్క చెయ్యకుండా, నగరద్వారాలు దాటి, అరణ్యమార్గం పట్టాడు.

"కోట బురుజుల మీది నుంచి అగ్నిబాణాలు ప్రయోగించి, అరణ్యంలో వాడెటు పోతున్నదీ చూడండి. ఈ లోపల అశ్వికులు వాడి వెన్నంటిపోయి చుట్టుముట్టండి. రాక్షసుణ్ణి హతమార్చేందుకు నేనే స్వయంగా వస్తున్నాను," అంటూ ఉగ్రసేనుడు పెద్దగా కేకపెట్టాడు. వెంటనే సైనికులు బాణాలకు నూనెరాసిన గుడ్డలు చుట్టి, వాటిని వెలిగించి, రాక్షసుడు పోయిన మార్గం కేసి వదలసాగారు. అశ్వికభటులు కొందరు వేగంగా నగరద్వారాలు దాటి రాక్షసుడి వెంట పడ్డారు. —(ఇంకావుంది)





# వ్యర్థమైన శక్తులు

విసుగుచెందని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీ సహనం అద్వితీయం. ఏదైనా మహత్తరశక్తి సాధించడానికి నీవు ఇలా శ్రమిస్తున్న పక్షంలో, అలాటి అపూర్వశక్తులను సాధించి కూడా చివరకు వినాశం పొందిన నలుగురు బ్రాహ్మణ కుమారుల కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు:

కుసుమపుర మనే రాజ్యంలో బ్రహ్మస్థల మనే అగ్రహారం ఉండేది. అక్కడ విష్ణుస్వామి అనే బ్రాహ్మణు డుండేవాడు. ఆయనకు నలుగురు కొడుకు లుండేవారు. వారు బాల్యం దాటి వేదాధ్యయనం చేస్తున్న సమయంలో విష్ణుస్వామీ, అయన భార్యా కూడా మరణించారు. తలిదండ్రులిద్దరూ

## బేతాళ కథలు

చనిపోవటంతో నలుగురు అన్నదమ్ములూ దిక్కులేని వాళ్ళయి, యజ్ఞస్థల మనే అగ్రహారంలో ఉంటున్న తమ మేనమామల దగ్గిరికి వెళ్ళి, అక్కడ ఉంటూ వచ్చారు. కాని కాలం కలిసిరాక వాళ్ళ మేనమామలకు కూడా దారిద్ర్యం సంప్రాప్తమయింది. అన్నదమ్ములకు తినటానికి తిండీ, కట్టటానికి బట్టా కూడా లేనిస్థితి ఏర్పడింది. అందరూ వారిని చాలా హీనంగా చూడసాగారు.

ఇలాటి దుర్దశలో పెద్దవాడు ఒకనాడు శ్మశానం కేసి వెళ్ళి, అక్కడ ఒక శవాన్ని చూసి, "ఆహా, ప్రాణాలు పోయిన వీడు మా కన్న ఎంత అదృష్టవంతుడు!" అనుకుని, ఒక తాడుతెచ్చి, చెట్టుకొమ్మకు తనను తాను ఉరి వేసుకున్నాడు. వాడికి స్పృహ తప్పిందిగాని ప్రాణాలుపోలేదు. ఆ స్థితిలో తాడు తెగి వాడు నేల మీద పడిపోయాడు.

వాడికి తిరిగి స్పృహ వచ్చేసరికి ఎవడో సత్పురుషుడు వాడి పక్కన కూర్చుని పైగుడ్డతో విసురుతూ కనిపించి, "నాయనా, చదువుకున్న వాడివిలాగున్నావు. పాపం వల్ల కష్టాలువస్తాయి. వాటిని తొలగించుకోవాలంటే పుణ్యకర్మలు చెయ్యాగాని, ఆత్మహత్య చేసుకోవటం వల్ల ఏం పరిష్కారమవుతుంది?" అని ఓదార్చి, తన దారిన తాను వెళ్ళిపోయాడు.



పెద్దవాడు తన తమ్ములను చేరుకుని, వారికి జరిగిన దంతా తెలిపి, "నేను హిమాలయాలకు వెళ్ళి తపస్సు చేసుకుని వచ్చే జన్మలో దారిద్ర్య బాధ లేకుండా చేసుకుంటాను," అన్నాడు.

దానికి తమ్ములు, "డబ్బులేని కారణం చేతనే దుఃఖబాధ కలుగుతుంది. డబ్బు చంచలమైనది. అందుచేత బంగారాన్ని అవలీలగా వశపరచుకునే శక్తులను మనం సాధించాలి," అన్నారు.

నలుగురూ కూడబలుక్కుని అలాటి శక్తులను సాధించే విద్య కోసరం నాలుగు దిక్కులా బయలుదేరిపోతూ, కొంతకాలం గడిచాక తిరిగి అదే స్థలంలో అందరూ కలుసుకునేటట్టు సంకేతం ఏర్పరచుకుని వెళ్ళిపోయారు.

కొంతకాలం గడిచింది. నలుగురూ తిరిగి సంకేతస్థానంలో కలుసుకుని, నువే విద్య నేర్చుకున్నావంటే నువే విద్య నేర్చుకున్నావని ఒకరినొకరు ప్రశ్నించుకున్నారు.

"ఏప్రాణి తాలూకు ఎముకగాని దొరికితే, దానిపైన ఉండవలసిన మాంసాన్ని సృష్టించే విద్య నాకు తెలుసు," అన్నాడు ఒకడు.

"ఆ మాంసం మీద ఉండే చర్మాన్నీ, రోమాలనూ నేను సృష్టించగలను," అన్నాడు రెండోవాడు.



"మిగిలిన శరీర మంతా నేను సృష్టించ గలను," అన్నాడు మూడోవాడు.

"మీ చేతనైన విద్యలు యీపాటివేనా ? సరే, నేను మీరు ముగ్గురూ కలిసి సృష్టించిన కళేబరానికి ప్రాణం పొయ్య గల ను," అన్నాడు నాలుగోవాడు.

తమతమ విద్యలను నిరూపించటానికి గాను ఎముకను వెతుక్కుంటూ వాళ్ళు నలుగురూ అరణ్యానికి వెళ్ళారు. అక్కడ వారి కొక ఎముక దొరికింది. అది ఒక సింహం ఎముక. అన్నదమ్ములలో ఒకడు దానిపైన కండలనూ, మాంసాన్నీ సృష్టించాడు. రెండోవాడు దానిపైన చర్మమూ, రోమాలూ సృష్టించాడు. మూడోవాడు సింహం కళేబరాన్ని పూర్తిచేశాడు. నాలుగోవాడు ఆ సింహానికి ప్రాణంపోశాడు. వెంటనే ఆ సింహం ఆ నలుగురు అన్నదమ్ముల పైనా పడి, వారిని చంపి తిని సుఖంగా తన దారిన తాను వెళ్ళిపోయింది.

బేతాళు డీ కథ చెప్పి, "రాజా, నలుగురూ సింహం వాత పడటానికి కారకుడు ఆ నలుగురిలోనూ ఎవరు? ఆ పాపం ఎవరిని చుట్టుకుంటుంది? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో నీ తల పగులుతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "పాపం చేసినది సింహానికి ప్రాణం పోసినవాడే. అతను సింహాన్ని సృష్టించలేదు గదా అనవచ్చు. కాని మిగిలిన ముగ్గురూ తాము ఏప్రాణిని సృష్టిస్తున్నదీ ఎరగరు. వాళ్ళు తమ విద్యలను మాత్రమే ప్రదర్శించారు. అయితే నాలుగోవాడు తాను ప్రాణం పోస్తున్నది సింహానికని తెలిసికూడా ప్రాణం పోశాడు. అతని పాపకార్యం మూలానే అందరూ చచ్చారు," అన్నాడు.

రాజు కీవిధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు.






# మనసులోని మాట

ఒక గ్రామంలో ఒక స్త్రీకి ముగ్గురు కొడుకులు పుట్టాక, ఆమె భర్త చనిపోయాడు. మరి కొంతకాలం గడిచాక ఆమె కూడా చనిపోతూ, తన పెద్ద కొడుకు లిద్దరినీ దగ్గిరికి పిలిచి, "మీ తమ్ముడు చిదంబరుడు పసివాడు. వాణ్ణి శ్రద్ధగానూ, ఏమాత్రమూ కష్ట పెట్టకుండానూ పెంచి పెద్దవాణ్ణి చేస్తామని ప్రమాణం చెయ్యండి. లేకపోతే నేను నిశ్చింతగా చావలేను, నా ఆత్మకు శాంతి ఉండదు," అన్నది. వాళ్ళు ఆమె కోరినట్టే ప్రమాణం చేశారు. అనంతరం ఆమె కన్ను మూసింది.

చిదంబరుడి అన్నలిద్దరూ కష్టపడి వ్యవసాయం చేసి అన్యోన్యంగా ఉంటూ చిదంబరుణ్ణి పువ్వుల్లో పెట్టి పెంచారు. ఎన్నడూ ఎలాటి శ్రమాపడకుండా, రాజకుమారుడి లాగా పెరిగిన చిదంబరుడికి, అన్నలు మట్టి పనీ, బురదపనీ చెయ్యటం చూసి చాలా రోతగా ఉండేది. వాడు మంచిమంచి బట్టలు ధరించి, తోటలలోనూ, నదీతీరానా షికార్లు కొడుతూ, తాను పల్లకీ ఎక్కాలనీ, ఏనుగు అంబారీ పైన ఊరేగాలనీ గొంతెమ్మ కోరికలు కోరుకునేవాడు.

తమ్ముడు బొత్తిగా గాలితిరుగుడు తిరుగుతున్నందుకు అన్నలు కూడా ఏమీ అనుకోలేదు. వాళ్ళు తమ తల్లికి మాట ఇచ్చారు, ఆ మాట నిలబెట్టుకుంటున్నారు, అంతే. చక్కగా మూడు పూటలా కడుపు నిండా తింటూ, చిదంబరుడు బలంగానూ, అందంగానూ, ఒక రాజకుమారు డనిపించేటట్టుగానూ తయారయాడు.

కాలక్రమాన పెద్దవాళ్ళిద్దరూ పెళ్ళిళ్ళు చేసుకుని, భార్యలను కాపరానికి తెచ్చుకున్నారు. చిదంబరుడు ఏ పనీ చెయ్యకుండా భోజనానికి మటుకు హాజరుకావటం చూసి అతని వదినెలు సహించలేక

టి. హనుమంతరావు



పోయారు. వాళ్ళు తమ భర్తలతో ఇలా జరగటానికి వీలులేదన్నారు.

"వాణ్ణి ఏ విధంగానూ కష్టపెట్టకుండా పెంచి పెద్దవాణ్ణి చేస్తామని, మా తల్లికి మాట ఇచ్చాం," అన్నారు భర్తలు.

"పెంచి పెద్దవాణ్ణి చేస్తామని మాట ఇచ్చారేగాని యావజ్జీవం భరిస్తామని మాట ఇవ్వలేదుగద? మీ తమ్ముడు పెరిగి పెద్దవాడయాడు. ఇక అతని కాళ్ళమీద అతను నిలబడవచ్చు. అతని బతుకు అతనే చూసుకోవాలిగాని మీ రింకా పోషించటంలో అర్థమేమిటి?" అని చిదంబరుడి వదినెలు తమ భర్తలతో అన్నారు.

భార్యలు చెప్పిన మాట చిదంబరుడి అన్నలకు సబబుగానే తోచింది. వాళ్ళిద్దరూ వేరే ఇళ్ళు కట్టుకుని, వేరే కాపరాలు పెట్టి చిదంబరుడికి తమ పాత ఇల్లూ, పాత్ర సామగ్రి అతని వంతు ఆస్తి కింద ఇచ్చేశారు.

చిదంబరు డిప్పుడు ఒంటరిగాడై, తన బతుకు తాను బతకవలసిన వాడయాడు. అతనికి వంట చేసుకోవటం కూడా చేత కాదు. అందుచేత ఒక రోజల్లా తిండి లేకుండానే గడిపి, ఆ రాత్రి శోషతో పడుకుని నిద్రపోయాడు.

ఆ నిద్రలో చిదంబరుడి కొక కల వచ్చింది. ఆ కలలో ఒక స్త్రీ కనబడి, అతని తల నిమురుతూ, "నేను నీ తల్లినిరా, నాయనా. నువ్వేమో జీవితంలో పెద్ద ఆశలు పెట్టుకున్నావు. అవి దైవసహాయం లేకుండా నెరవేరేవికావు. నేను నీకు ఇతరుల మనసు తెలుసుకునే శక్తి నిస్తాను. ఆ శక్తి సహాయంతో సుఖపడు. పల్లెలో చెడినవాడు పట్నంపోయి బతకాలంటారు. నువు నగరానికి వెళ్ళి రాజుగారి నాశ్రయించు," అని చెప్పింది.

చిదంబరుడు నిద్రలేచాక కూడా, పల్లెలో చెడినవాడు పట్నం వెళ్ళాలన్న మాట అతని చెవిలో మారుమోగుతూనే ఉన్నది. అతను

తెల్లవారుతూనే పట్టణానికి బయలుదేరి పోయి, రాజభవనానికి వెళ్ళి, అక్కడి అధికారిని తన కేదన్నా పని చూపమని వేడుకున్నాడు. చిదంబరుడి అందమైన విగ్రహం చూసి ముచ్చటపడి, రాజభవనాధికారి అతన్ని రాజద్వారం వద్ద కాపలా ఉండే దళంలో చేర్చాడు.

ఒకనాడు రాజుగారి దర్బారుకు పొరుగు దేశపు సామంతు డొకడు వచ్చాడు. ఆయన తన పక్కగా లోపలికి వెళ్ళేటప్పుడు చిదంబరు డాయనను తేరిపార జూసి, వెంటనే తన పై అధికారి వద్దకు పరిగెత్తుకుపోయి, "అయ్యా, ఇప్పుడు లోపలికి వెళ్ళినవాడు పరమ దుర్మార్గుడు. అతను మన రాజుగారిని హత్యచేయవచ్చాడు. అతని దుస్తులలో విషం పూసిన కత్తి ఉన్నది. జాగ్రత్త పడండి," అన్నాడు.

ఆ అధికారి చిదంబరుడి మాటలు కొంతసేపు లక్ష్యపెట్టలేదు గాని, అతను అందోళనగా ఆ మాటే మళ్ళీమళ్ళీ చెప్పటంచేత చిదంబరుణ్ణి మంత్రి దగ్గిరికి తీసుకువెళ్ళాడు.

మంత్రి అంతా విని, "ఒరే, నువ్వేమంటున్నావో తెలుసా? ఆ వచ్చిన పెద్దమనిషి కిందటిసారి యుద్ధంలో మన రాజుగారికి సహాయం చేసిన స్నేహితుడు. నిన్ను శిరశ్ఛేదం చెయ్యాలి," అన్నాడు.





"ముందు ఆ దుర్మార్గుణ్ణి 'పరీక్ష చేసి, నేను చెప్పినది అబద్ధమైతే నా తల తీయించండి," అన్నాడు చిదంబరుడు.

మంత్రి రాజు వద్దకు వెళ్ళేసమయానికి, కొత్తగా వచ్చిన సామంతుడు రాజుతో, "తమతో ఏకాంతంగా ఒక రహస్య విషయం మాట్లాడాలి," అంటున్నాడు.

రాజుగారు అయనను తన రహస్యాలోచనామందిరం లోకి పంపి, నౌకర్లతో, "నేను పిలిచేదాకా ఎవరినీ లోపలికి రానివ్వద్దు," అంటున్నాడు. రాజుగారు లోపలికి పోబోతుండగా మంత్రి అపి, ఆయనకు చిదంబరుడు చెప్పిన మాట చెప్పాడు.

రాజుగారు నిర్ఘాంతపోయి, ఏదో మిష మీద ఆ సామంతుణ్ణి సోదా చేయించమని మంత్రితో అన్నాడు.

మంత్రి కొంతమంది భటులతో రహస్యాలోచనా మందిరంలోకి వెళ్ళి, "క్షమించాలి. మిమ్మల్ని లాంఛనప్రాయంగా పరీక్షించవలసి ఉన్నది," అన్నాడు.

ఆ మాట వినేసరికి సామంతుడి ముఖం నల్లగా అయిపోయింది. భటులు అతన్ని శోధించగా, దుస్తుల లోపల విషం పూసిన కత్తి దొరికింది. దాని మీద శత్రురాజు ముద్ర ఉన్నది.

సామంతుడికి మరణదండన విధించి, తన ప్రాణం కాపాడిన చిదంబరుణ్ణి రాజుగారు తన అంగరక్షకులలో ఒకడుగా వేసుకున్నాడు. చిదంబరుడు రాజభవనం అంతటా తిరుగుతూ, రాజుగారి వెంటనే ఉండేవాడు. రాజుగారి భార్య పోయింది. అయనకొక కూతురూ, ఇద్దరు కొడుకులూ ఉన్నారు. అయన సపర్యలు దాసదాసీలే చూసేవారు.

ఒకనాడొక దాసీ రాజుగారి దగ్గిరికి భోజనం తెచ్చేటప్పుడు చిదంబరు డామెకేసి పరీక్షగా చూసి, అమె వెళ్ళాక రాజుగారి చెవిలో, "మహారాజా, ఈ అహారం ముట్ట

కండి. అందులో విషం ఉన్నది. ఈ వచ్చిన మనిషి శత్రురాజు మనిషి. మీకు విషాహారం పెట్టిన సంగతి ఈ రాత్రి తన కిటికీ కుండా చీటీ ద్వారా ఎవరికో అందజేయబోతున్నది," అన్నాడు. చిదంబరుడి మాట నిజమో కాదో తెలుసుకోవటానికి రాజు తన ముందున్న ఆహారాన్ని పిల్లికి వేశాడు. పిల్లి దాన్ని తిని చచ్చింది. రాజుగారు మరొక నౌకరు ద్వారా వేరే భోజనం తెప్పించుకున్నాడు.

ఆ రాత్రి దాసీదాని కిటికీ వద్ద కెవరో వచ్చారు. దాసీది వాడి కొక చీటీ ఇచ్చింది. వెంటనే బయట దాగి ఉండిన భటులు ఆ మనిషి మీదపడి, ఆ చీటీ పట్టుకున్నారు. దాసీది రాజుగారికి విషభోజనం పెట్టినట్టు ఆ చీటిలో స్పష్టంగా రాసి ఉన్నది.

చిదంబరుడికి గల శక్తి రాజుగారికి ఆశ్చర్యం కలిగించింది. చనిపోయిన తన తల్లి ఇతరుల మనసులను గ్రహించే శక్తి తన కిచ్చిందని చిదంబరుడు రాజుకు చెప్పాడు. "ఆలా అయితే నా కింద కొలువు చేస్తున్న వారిలో విశ్వాసపాత్రులు కానివా రెవరో చూసి చెప్పు," అన్నాడు రాజు.

చిదంబరుడు అందరినీ చూసి, అందరూ విశ్వాసపాత్రులేనన్నాడు. అటువంటి శక్తి గలవాడు తన వెంట ఉండటం తన కెంత లాభమో రాజు గ్రహించాడు.



ఒకనాడు రాజు చిదంబరుడితో, "నీవల్ల నాకొక ఉపకారం కావాలి. నా కుమార్తెకు పెళ్ళియీడు వచ్చింది. ఏ రాజకుమారుడి పేరెత్తినా తన కిప్పుడు పెళ్ళి వద్దంటుంది. దాని మనసులో ఏమున్నదో కాస్త తెలుసుకుని నాకు చెప్పు," అన్నాడు.

రాజకుమార్తెకు కబురుచేశారు. ఆమె వచ్చింది. చిదంబరుడామెను పరీక్షగా చూసి, "మహారాజా, ఈమె ఒక వరుణ్ణి కోరుతున్నది. అతన్ని ఆమె పెళ్ళాడతానంటే మీరు అభ్యంతరం చెబుతారని తెలిసి తనకు పెళ్ళి వద్దంటున్నది," అని చెప్పాడు.

"ఆమె ఎవరిని కోరుతున్నదో చెప్పగలవా?" అన్నాడు రాజు.

"ఆమె కోరేది నన్నే, మహారాజా!" అన్నాడు చిదంబరుడు.

రాజు నిర్ఘాంతపోయి కూతురి కేసి తిరిగి, "ఈ మాట నిజమా?" అన్నాడు. రాజకుమార్తె జవాబు చెప్పక, తల ఆడించి, అక్కడి నుంచి వెళ్ళిపోయింది.

రాజు చిదంబరుడి కేసి చూస్తూ ఏదో ఆలోచనలో పడ్డాడు. అది చూసి చిదంబరుడు చిరునవ్వు నవ్వాడు.

"నేనేమనుకుంటున్నానో నీకు తెలుస్తున్నదా?" అన్నాడు రాజు.

"తెలియకేం, మహారాజా? ఈ దిక్కుమాలిన వాడికి నా కుమార్తెనివ్వడమా అనుకుంటున్నారు. అయినా వీడి తప్పేమీ లేదులే, నా కూతురే వీణ్ణి ప్రేమించిందిగదా అనుకుంటున్నారు. నిరపరాధిని చంపించటం పాపమనుకుంటున్నారు," అన్నాడు చిదంబరుడు.

రాజు మారు మాటాడక తన కుమార్తెను చిదంబరుడి కిస్తానని ప్రకటించి, త్వరలోనే వారిద్దరికీ వైభవంగా పెళ్ళిచేశాడు. చిదంబరుడి గొంతెమ్మ కోరిక నిజమై పల్లకీ ఎక్కాడు, ఏనుగు అంబారీలో ఊరేగాడు.





# అధికారి ఆప్యాయత

పాపన్న ఉండే ప్రాంతానికి రాజ ప్రతి నిధిగా ఉండే శంభునాయకుడి కొడుకు పుట్టినరోజు పండగ వచ్చింది. గ్రామాధి కారులకూ, ఇతర ప్రముఖులకూ ఆహ్వానా లందాయి. పాపన్న ఉండే గ్రామానికి అధికారి జబ్బుగా ఉండి వెళ్ళలేకపోయాడు. అయన పాపన్న చేతికి నూరు రూపాయల విలవ చేసే బంగారుగొలుసూ, రాజప్రతినిధి గారికి గ్రామస్థుల తరఫున ప్రశంసాపత్రమూ, కుర్రవాడికి ఆశీస్సులు తెలుపుతూ ఒక లేఖా ఇచ్చి, అధికారికి అందజేయమని చెప్పి, నగరానికి పంపాడు.

పాపన్న ఉదయమే బయలుదేరి పన్నెండు మైళ్ళు నడిచి నగరం శివార్లు చేరుకుని, దుమ్ముకొట్టుకుని ఉన్న తన దుస్తులు విప్పేసి, సంచీలో నుంచి మంచి దుస్తులు తీసి వేసుకున్నాడు. రాజప్రతినిధి ఇల్లు ఒక మైలు దూరంలో ఉన్నది. కొత్త బట్టలు ధరించి, బాగా ముస్తాబై అక్కడికి వెళుతున్నవాళ్ళు పాపన్నకు కనిపించారు.

చింకి బట్టలు కట్టుకున్న పేదవాడొకడు నలుగురు పిల్లలను వెంటబెట్టుకుని దారి పక్క నిలబడి, దారే పొయ్యేవాళ్ళను ఏదో అర్థిస్తున్నాడు. ఎవరూ అతడి మాటలు వినిపించుకోకుండానే ముందుకు సాగి పోతున్నారు. పాపన్న దగ్గరలోకి రాగానే ఆ పేదవాడు, "అయ్యా బాబూ, ఒక ధోవతీ ఉంటే దయచేయించండి. ప్రభువుగారింటికి భోజనానికి వెళ్ళాలని ఉన్నది. ఈ చినిగిన బట్టలతో రానివ్వరు. ఈ పిల్లల్ని చూడండి. కాస్త పుణ్యంకట్టుకోండి," అని దీనంగా వేడుకున్నాడు.

పేదవాడి వెంట ఉన్నపిల్లలు కట్టుకున్న బట్టలు సుమారుగా ఉన్నాయి.

"నేను పొరుగూరు నుంచి వచ్చేవాణ్ణి. నా దగ్గిర వేరే బట్టలులేవు, ఇవే ఉన్నాయి,"




అంటూ పాపన్న తాను విడిచి సంచీలో పెట్టిన బట్టలు తీసి చూపాడు.

"అవే ఇవ్వండి, స్వామీ," అంటూ పేద వాడు వాటిని సంతోషంతో స్వీకరించాడు. తరవాత వాడు, "అమ్మను కూడా తీసుకు పోదాం," అంటూ పిల్లలను వెంటబెట్టుకుని తన గుడిసె వైపు వెళ్ళాడు.

పాపన్న కొంచెందూరం వెళ్ళాక ఒక దృశ్యం కనబడింది. ఒక గుర్రపు బండి దారి నుంచి పక్కకువెళ్ళి, పొలంలోని అడుసులో లోతుగా కూరుకుపోయి ఉన్నది. ఆ బండిలో ఒక పెద్దమనిషి కూర్చుని ఉన్నాడు. ఆయన వెంట బట్టల మూటలూ, ఖరీదైన వెండి సామాన్లూ ఎన్నో ఉన్నాయి. బండివాడు కిందికి దిగి చేత్తో గుర్రాన్ని పట్టుకుని, దానిచేత బండిని బురదలో నుంచి దారికి లాగించటానికి ప్రయత్నిస్తున్నాడు. బండిలో ఉన్న పెద్దమనిషి, "ఎవరినన్నా సాయం పిలవరా, వెధవా!" అని బండి వాణ్ణి గదమాయించాడు.

బండివాడు దారిలోకివెళ్ళి, "కాస్తబండిని తొయ్యండి, బాబూ," అని అడగసాగాడు.

బండిని తొయ్యాలంటే బురదలోకి దిగాలి. అటుగా వెళ్ళేవాళ్ళంతా మంచి మంచి బట్టలు వేసుకుని రాజప్రతినిధి ఇంటికి పోతూన్నవాళ్ళు కావటంచేత, బురదలోకి దిగి బండిని తొయ్యటం ఎవరికీ ఇష్టంకాలేదు.

ఇంతలో పాపన్న అక్కడికి వచ్చాడు. బండివాడు పాపన్నను కూడా, "కాస్త ఒక చెయ్యివేసి బండిని దారికి పట్టించండి, బాబూ. ఎదురుగా వచ్చిన ఆబోతును చూసి బెదిరి గుర్రం బండిని చేలోకి ఈడ్చింది. బురద కడుక్కోవటానికి పక్కనే కాలవ ఉన్నది," అన్నాడు.

"ఊరికే తోస్తార్రా? బేడో, పావలో ఇస్తామని చెప్పరా!" అన్నాడు బండిలో ఉన్న పెద్దమనిషి.



పాపన్న వెంటనే తన చేతి సంచీ కింద పెట్టి, బట్ట ఎగకట్టి, పొలంలోకి దిగి, బండిని నెట్టాడు. బండి ఒకంతట కదలలేదు. అప్పుడు పాపన్న ఒక చక్రాన్ని బురదలో నుంచి పైకెత్తి మరీ తోశాడు. బండివాడు ముందునుంచి గుర్రాన్ని లాగుతుంటే, బండి కదిలి, గట్టెక్కింది.

పాపన్న తన సంచీ తీసుకోవటానికి వెనక్కు తిరిగిన సమయంలో బండిలోని పెద్దమనిషి, "తీసుకోరా!" అంటూ పాపన్న దిక్కుగా ఒక బేడాకాసు పారేసి, బండితో పాటు వేగంగా సాగిపోయ్యాడు. ఆయనకు పాపన్న ముఖమైనా కనిపించలేదు.

పాపన్న ఆ బేడా తీసుకుని, మురికి చేతులతోనే తన సంచీ కూడా తీసుకుని కాలవ దాకా నడిచి వెళ్ళాడు. చక్రం పట్టి ఎత్తటంలో అతని బట్టలకు కందెన మరకలూ, బురదమరకలూ కూడా అయాయి. ఆ మరకలను కడగటానికి యత్నిస్తే మరింతమేర మరకలు విస్తరించాయి. చేసేదిలేక పాపన్న కాలవలో కాళ్ళూ చేతులూ కడుక్కుని వెనక్కు తిరిగివచ్చాడు.

పొలంలో నుంచి బండీ రోడ్డు మీదికి వచ్చిన ప్రాంతంలో పాపన్న కొక పెట్టె, గుప్పిట ఇమిడేటంతది, కనబడింది. అది



చిన్న చిన్న నగలు పెట్టుకునే పెట్టె. పాపన్న దాన్ని తెరిచి చూస్తే అందులో ఒక రవ్వపు టుంగరం ఉన్నది. అది బండిలో నుంచి కిందపడి ఉంటుంది. దాన్ని ఆ బండిలోని పెద్దమనిషికి చేర్చాలంటే, ఆ మనిషిని పాపన్న సరిగా చూడలేదు, బండివాణ్ణి మాత్రమే బాగా చూశాడు. బండిలో ఉండిన పెద్దమనిషికి తలపాగా, మీసాలూ ఉన్నట్టు మాత్రమే పాపన్నకు గుర్తు. ఆ పెద్దమనిషి కనిపించినా, ఉంగరం పోగొట్టుకున్న మనిషి సమాచారం తెలియవచ్చినా దాన్ని ఇచ్చేద్దా మనుకుని పాపన్న ఆ ఉంగరం పెట్టెను తన సంచీలో వేసుకున్నాడు.






శంభునాయకుడి ఇంటిముందున్న దర్వాన్ పాపన్న దుస్తులూ, మరకలూ చూసి అటకాయించాడు. అక్కడే ఉన్న ఒక ఉద్యోగి పాపన్నను సమీపించి, "ఎవరయ్యా నువు? ఇటెందుకు, అలా భోజనశాలకు వెళ్ళు," అన్నాడు.

తాను ఫలానా గ్రామాధికారి తరఫున వచ్చాననీ, ఆ గ్రామాధికారికి సుస్తీగా ఉన్నదనీ పాపన్న అధికారితో చెప్పాడు.

"గ్రామాధికారికి జబ్బుగా ఉంటే నీలాటి వాణ్ణా పంపేది? ఈ అవతారంతో వెళ్ళి రాజప్రతినిధిగారిని చూస్తానంటావా? పద పద!" అంటూ ఆ అధికారి, ఇతర అతిథులను మర్యాద చెయ్యటంలో నిమగ్నుడైపోయాడు.

"పోనీ ఈ కానుకలైనా లోపలికి చేర్చండి," అంటూ పాపన్న తన చేతి సంచీ పైకెత్తాడు.

"చంపక, నువ్వవతలికి పో, బాబూ. మనిషి రాకుండా వట్టి కానుకలు వచ్చాయంటే ప్రభువుగారు మండిపడతారు. వాటిని తెచ్చినచోటికే తీసుకుపో, అందరికీ క్షేమం," అన్నాడు అధికారి.

చేసేదిలేక పాపన్న వెళ్ళి వసారాలో కూర్చున్నాడు. తాను వచ్చినపని కాస్తా భ్రష్టయిపోయినందు కతనికి చాలా కష్టం కలిగింది. ఏ అంగడికైనా వెళ్ళి కొత్త బట్టలు కొని కట్టుకు వద్దామంటే పుణ్యకాలం కాస్తా వెళ్ళిపోతుంది.

పాపన్న ఏంచెయ్యటానికీ పాలుబోని స్థితిలో ఉండగా ఒక పెద్దమనిషి తల వంచుకుని దీర్ఘాలోచన చేస్తూ పాపన్న కేసి వచ్చాడు.

పొలంలో దిగబడిన బండిలో ఉండిన పెద్దమనిషి ఈయనే. ఈయన రాజప్రతినిధి గారి ప్రధానకార్యదర్శి. ఆహ్వానించబడిన వారి కివ్వటానికి కానుకలూ, కుర్రవాడి కొక రవ్వపుటుంగరమూ కొనుక్కొని ఆయన

బండిలో తిరిగి వస్తూండగా బండి పొలాల లోకి దిగటం జరిగింది. దాన్ని గట్టు మీద ఎక్కించి రోడ్డు మీదికి దించేటప్పుడు, ఒక వెండి గిన్నె బోర్లాపడి, అందులో ఉంచిన ఉంగరంపెట్టె బండి కంతల్లో నుంచి రోడ్డు పక్కన పడింది. ఇంటికి వచ్చి ఎంత వెతికినా ఆ ఉంగరంపెట్టె కనిపించలేదు.

ఉంగరం పోయిందని చెప్పగానే కార్యదర్శిని శంభునాయకుడు చెడామడా తిట్టాడు. వెయ్యి రూపాయల ఉంగరం! అది తీసుకురాకుండా ముఖం చూపించ వద్దని ఆయన కార్యదర్శిని అవమానించాడు. పరాభవంపొంది కార్యదర్శి బయటికి వస్తూనే పాపన్నను చూశాడు. తాను బేడా కాసు విసిరింది ఇలాటి మనిషికేనని ఆయనకు తోచి, "ఏమయ్యా, పొలం నుంచి బండిని ఇవతలికి ఈడ్చిన వాడివి నువేకాదూ?" అని అడిగాడు.

"నేనే, నన్నుచూస్తే తెలియటంలేదా?" అన్నాడు పాపన్న.

"నీకు ఒక ఉంగరంపెట్టెగాని దొరికిందా?" అన్నాడు కార్యదర్శి.

"అది మీదేనా? అయితే మిమ్మల్ని నేను చూడలేదు. అది మీదని నే నెలా నమ్మేది?" అన్నాడు పాపన్న.



"చాల్లే, పిచ్చిపిచ్చి ప్రశ్నలు వెయ్యాక, దాన్ని ఇలా ఇచ్చెయ్యి," అన్నాడు కార్యదర్శి, పోయిన ఉంగరం తేలికగా దొరికిందన్న ధీమాతో.

"తొందరపడకండి. నేనా పెట్టెను ఎత్తుకోవటం మీరు ఏ చెట్టుచాటు నుంచి అయినా చూశారేమో? నా కెలాతెలుస్తుంది? ఆ బండిలో వచ్చినది మీరేనని బండివాడి చేత సాక్ష్యం చెప్పించండి," అన్నాడు పాపన్న, తన మీదికి వచ్చిన కార్యదర్శిని అవతలికి నెట్టుతూ.

కార్యదర్శికి చాలా పెద్ద అవమానమయింది. తనంత వాణ్ణి అసత్యవాది కింద

జమకట్టటమేగాగ, వీడెవడో బండివాడి సాక్ష్యం నమ్ముతానంటాడా? ఎవరన్నా వింటే తన కెంత పరువుతక్కువ! తాను విసిరిన బేడా ఎత్తుకున్న వెధవ తన నింత తేలికచేసి మాట్లాడటమా? ఇలా అనుకుని కార్యదర్శి పాపన్న మీద చెయ్యి చేసుకో బోయాడు. బలశాలి అయిన పన్న కార్య దర్శిని అంత ఎడంలోనే నిలబెట్టాడు.

నలుగురూ చేరారు. వాళ్ళు కూడా పాపన్న పక్షమే అయి, "అతననేది న్యాయం గానే ఉంది. అతను మిమ్మల్నెరగనంటు న్నాడు. అలాటప్పుడు బండివాణ్ణి పిలిపించ టానికేం?" అన్నారు.

కార్యదర్శి ఒకణ్ణి పంపి బండివాణ్ణి బండితో సహా తెప్పించాడు. బండిలో ఉండి నది కార్యదర్శేనని బండివాడు చెప్పిన మీదట పాపన్న కార్యదర్శి చేత ఉంగరం గుర్తులు కూడా చెప్పించి, ఆ తరవాత ఉంగరం పెట్టెను కార్యదర్శి చేతికిచ్చాడు.

ఈలోపుగా, ఉంగరం ఎవరికో దొరికిం దనీ, ఆ మనిషితో కార్యదర్శి తగాదా పడు తున్నాడనీ శంభునాయకుడికి తెలిసి, ఆయన బయటికి వచ్చాడు. ఆయన అడిగినమీదట పాపన్న జరిగిన సంగతంతా చెప్పాడు. బండి ఎత్తటానికి సహాయపడిన కారణంగా బట్ట లన్నీ మరకలు చేసుకుని పాపన్న లోపలికి రాలేకపోయినందు కాయన చాలా నొచ్చు కుని, పాపన్నతో ఎంతో ఆప్యాయంగా మాట్లాడి, "నిన్ను గురించి అదివరకు విన్నాను. ఈ విధంగా మనం కలుసు కోవటం జరిగింది. చాలా సంతోషం. లోపలికిరా," అంటూ తన వెంట తీసుకు పోయి, చాలా మర్యాదచేసి, అతను తెచ్చిన కానుకలు తీసుకుని, అతనికీ, అతని గ్రామాధికారికీ కానుకలిచ్చి పంపేశాడు. తన యజమాని చేత అంత మర్యాదపొందిన వాడికి తాను బేడాకాసు పారేసినందుకు కార్యదర్శి సిగ్గుపడి సతమతమయాడు.





# లోహజంఘుడికథ

పూర్వం మధురానగరంలో మకరదంష్ట్ర అనే వృద్ధ దేవదాసికి రూపణిక అనే కుమార్తె ఉండేది. ఆమె చాలా చక్కనిది. ఒకనాడామె దేవాలయంలో పూజా సమయాన సేవ చెయ్యటానికి తన వంతు రాగా, అక్కడ ఒక అందగాణ్ణి చూసి ఆ క్షణం లోనే అతన్ని మోహించింది. అందుచేత ఆమె అతని దగ్గిరికి తన దాసీని పంపి, తన ఇంటికి రావలిసిందిగా అతడికి చెప్పించింది.

అతను సంగతి గ్రహించి రూపణిక పంపిన దాసితో, "నేను లోహజంఘు డనే బ్రాహ్మణుణ్ణి. నా దగ్గిర చిల్లిగవ్వ లేదు. రూపణిక ఇంట అడుగుపెట్టే హక్కు నాకు లేదు," అన్నాడు.

"మా యజమానురాలికి నీ డబ్బేమీ అవసరం లేదు," అన్నది దాసి. అలా అయితే వస్తానని చెప్పమన్నాడు లోహజంఘుడు. ఈ మాటకు రూపణిక చాలా సంతోషించి, ఇంటికి వెళ్ళి, అతని రాక కోసం ఆత్రంగా ఎదురు చూడసాగింది.

కొంత సేపటికి లోహజంఘుడు రాగా మకరదంష్ట్ర, "వీడెక్కడి నుంచి ఊడి పడ్డాడు?" అనుకున్నది. రూపణిక మాత్రం, లోహజంఘుడి రాకతో తన జన్మ తరించి నట్టు తలపోసింది. ఆమె అతన్ని తన ఇంటనే ఉంచుకుని స్వర్గంలో ఉన్నంత ఆనందం పొందసాగింది.

అది చూసి తల్లి రూపణికతో, "డబ్బు లేని ఈ మనిషిని ఇంట చేర్చావెందుకే? మన జాతి డబ్బును ప్రేమించాలి గాని, మనిషిని ప్రేమించరాదు. నీ కీ సంగతి ఎన్నిసార్లు చెప్పాను?" అన్నది.

"అమ్మా, ఈ మనిషి నాకు ప్రాణం కంటె ఎక్కువైనవాడు. నాకు డబ్బు కేం తక్కువ? కట్టుకుపోయినంత ఉన్నది.



ఇలాటి ఉపదేశాలు నా కిక ఎన్నడూ చెయ్యకు," అన్నది. రూపణిక.

కూతురిలా అనటం చూసి మకరదంష్ట్రకు చాలా కోపం వచ్చింది. కాని కూతుర్ని ఏమీ చెయ్యలేక, లోహజంఘుణ్ణి ఎలా వెళ్ళ గొట్టటమా అనే ఆలోచనలో పడింది. ఒక నాడు రూపణిక దేవాలయానికి వెళ్ళి, లోహజంఘుడు కూడా ఇంట లేని సమయంలో ఒక క్షత్రియుడు కొందరు సైనికులను వెంటబెట్టుకుని వస్తూ ఉండటం ముసలిదానికి కనిపించింది. ఆమె ఆ క్షత్రియుణ్ణి ఒంటరిగా లోపలికి పిలిచి, "ఒక డబ్బులేని దరిద్రుడు మా ఇంట చేరి వెళ్ళకుండా ఉన్నాడు. వాడి పీడ మాకు లేకుండా చేస్తివా, నా కూతురు నీ తోనే ఉంటుంది," అని ఆశపెట్టింది.

క్షత్రియు డందుకు సమ్మతించి ఆ దేవదాసి ఇంట ప్రవేశించాడు. కొంతసేపటికి లోహజంఘుడు తిరిగి వచ్చాడు. వెంటనే క్షత్రియుడి సైనికులు అతని పైన పడి చావగొట్టి, తీసుకుపోయి ఒక మురికిగుంటలో పారేశారు. మరికొంత సేపటికి రూపణిక తిరిగి వచ్చి, జరిగిన సంగతి తెలుసుకుని పెద్దపెట్టున ఏడవసాగింది. అది చూసి క్షత్రియుడు ఇంటి నుంచి వెళ్ళిపోయాడు.

లోహజంఘుడికి తీరని అవమానమూ, తన ప్రియురాలితో వియోగమూ ఒకేసారి కలగటం చేత, ఒకవంక మకరదంష్ట్ర మీద కసిగా ఉన్నప్పటికీ, జీవితం పైన విరక్తి పుట్టి, తీర్థయాత్రలు చేస్తూ ప్రాణాలు వదలటానికి నిశ్చయించి బయలుదేరాడు.

అతను ఒక ఎడారి ప్రాంతంగుండా పోతూండగా ఎండబాధ చాలా జాస్తి అయింది. తల దాచుకుందామంటే ఎక్కడా చెట్టు నీడ అయినా లేదు. అందుచేత తపనతో కొట్టుకుంటున్న లోహజంఘుడికి ఒక చోట ఒక ఏనుగు కళేబరం కనబడింది. నక్కలు ఆ కళేబరానికి బొక్క పెట్టి లోపలి



భాగమంతా తిని డొల్లచేశాయి. లోహజంఘుడా కళేబరంలోకి దూరి, అక్కడ చల్లగా ఉండటం చేత నిద్రపోయాడు.

అతను తిరిగి నిద్ర లేచేసరికి మహా ప్రళయంగా వర్షం కురుస్తున్నది. ఏనుగు కళేబరంలో ఉండిన దారి కాస్తా మూసుకుపోయింది. ఆ కళేబరం వర్షపునీటికి తేలి, కొట్టుకుపోయి గంగానది ప్రవేశించి, గంగా ప్రవాహం వెంబడి సముద్రాన్ని చేరింది. సముద్రంలో తేలి ఉన్న ఏనుగు కళేబరాన్ని చూసి ఒక పెద్ద గరుడజాతి పక్షి దాన్ని తన్నుకుని సముద్రం అవతల ఉండే లంకకు తీసుకుపోయింది. ఆ పక్షి కళేబరాన్ని ముక్కుతో పొడిచే సరికి, ద్వారం ఏర్పడి, దానికుండా లోహజంఘుడు బయటికి వచ్చాడు. మనిషిని చూడగానే పక్షి కాస్తా పారిపోయింది. అక్కడి పరిసరాలను చూసి లోహజంఘుడు తాను మేలుకుని ఉండే కలగంటున్నా ననుకున్నాడు.

అక్కడ అతనికి ఇద్దరు రాక్షసులు కనిపించారు. వాళ్ళను చూసి లోహజంఘుడు భయపడ్డాడు. వాళ్ళు కూడా అతన్ని చూసి భయపడ్డారు. రాము డిలాగే సముద్రం దాటి వచ్చినప్పుడు లంకలోని రాక్షసుల కేం గతి పట్టినదీ వాళ్ళు మరవలేదు. వాళ్ళు తమలో




తాము కూడబలుక్కున్న మీదట వారిలో ఒకడు విభీషణుడి వద్దకు వెళ్ళి, ఎవడో మనిషి సముద్రం దాటి లంకకు వచ్చాడని చెప్పాడు. విభీషణుడు కూడా ఈ వార్త విని భయపడి, లోహజంఘుణ్ణి తన యింటికి వచ్చి, తన ఆతిథ్యం స్వీకరించి అనుగ్రహించమని రాక్షసుడి ద్వారా ఆహ్వానం పంపాడు. లోహజంఘుడు ఆ ఇద్దరు రాక్షసుల వెంట లంకానగరానికి వచ్చి, విభీషణుణ్ణి చూసి, ఆశీర్వదించాడు.

విభీషణు డతనికి అతిథి సత్కారాలన్నీ చేసి, "అయ్యా, ఈ లంకకు ఎలా రాగలిగావు?" అని అడిగాడు.





దానికి లోహజంఘు డిలా కల్పించి ఒక కథ చెప్పాడు:

"నేను మధురానగరంలో ఉండే లోహజంఘు డనేవాణ్ణి. దారిద్ర్యం బాధ భరించలేక, నారాయణాలయానికి వెళ్ళి నిరాహారంగా తపస్సు చేశాను. అప్పుడు దేవుడు నాకు కలలో ప్రత్యక్షమై, 'నీవు విభీషణుడి వద్దకు వెళ్ళు. అతను నా భక్తుడు. అతను నీకు ధనమిస్తాడు,' అని చెప్పాడు. 'ఎక్కడి నేను, ఎక్కడి విభీషణుడు, ఎలా వెళ్ళటం?' అన్నాను. 'ఇవాళే నీవు విభీషణుణ్ణి కలుస్తావు,' అని చెప్పి దేవుడు అదృశ్యమయాడు. నేను తెల్లవారి లేచేసరికి సముద్రం ఇవతలి తీరాన ఉన్నాను. ఏమి జరిగినదీ నాకు కూడా తెలీదు."

మానవమాత్రుడు రాలేని లంకకు లోహజంఘుడు రావటం చూసి విభీషణుడు కూడా దైవమహిమే అని నమ్మాడు. అతను తన రాక్షసులను పంపి స్వర్ణమూల పర్వతం మీద ఉండే పెద్ద గరుడపక్షిని ఒకదాన్ని తెప్పించాడు; "మీ మధురా నగరంలో ఉండే నారాయణుడికి ఈ అలంకారాలు సమర్పించు," అని లోహజంఘుడి చేతికి శంఖుచక్రగదాది ఆభరణాలిచ్చాడు; లోహజంఘుడి కోసం అనేక రత్నాలూ అవీ ఇచ్చాడు.

లోహజంఘుడు విభీషణుడి అతిథిగా కొద్ది కాలం లంకలో ఉండి, అక్కడి వింతలు చూసి, విభీషణు డిచ్చిన కానుకలన్నీ తీసుకుని, లక్షయోజనాలు ఆగకుండా ప్రయాణించగల గరుడపక్షి నెక్కి మధురకు తిరిగి వచ్చి, నగరం వెలపల ఒక నిర్జనమైన విహారం వద్ద దిగి, పక్షిని కట్టేసి, తాను తెచ్చుకున్న రత్నాలను ఒక చోట దాచి, నగరానికి వెళ్ళి ఒక రత్నాన్ని అమ్మి, తనకూ పక్షికీ ఆహారం కొని తాను తిని, పక్షికి పెట్టి, సాయంకాలం అయాక మేలైన బట్టలు ధరించి, రత్నాలతో తనను తాను

అలంకరించుకుని శంఖు చక్ర గదాదులు పట్టుకుని, విష్ణుమూర్తి అవతారంలో పక్షి మీద ఎక్కి రూపణిక ఇంటి మీదుగా అటూయిటూ ఎగురుతూ శంఖం ఊది పెద్ద ధ్వని చేశాడు.

ఆ ధ్వని విని రూపణిక బయటికి వచ్చి తన ఇంటి పైన ఎగిరే విష్ణువు లాటి మనిషిని చూసింది. అతను పక్షితో సహా కిందికి దిగి, పక్షిని కట్టేసి, "నేను హరిని. నీ కోసం వచ్చాను," అన్నాడు.

రూపణిక అతనికి నమస్కారం చేసి, "దేవా, అనుగ్రహించు," అని అతన్ని లోపలికి తీసుకుపోయింది. లోహజంఘు డామెతో కొంత సేపు గడిపి, వెంటనే పక్షి నెక్కి ఆకాశంలో ఎగురుతూ వెళ్ళిపోయాడు.

మర్నాడు తెల్లవారాక రూపణిక, "నే నిప్పుడు విష్ణుమూర్తి భార్యను. మనుషులతో మాట్లాడను," అనుకున్నది.

కూతురిలో ఏదో మార్పు గమనించి మకరదంష్ట్ర, "ఎందుకే, అమ్మాయీ, అలా ఉన్నావూ?" అని అడిగింది. రూపణిక మాట్లాడక పోయేసరికి తల్లి గుచ్చిగుచ్చి అడిగింది. తల్లిబాధ పడలేక రూపణిక ఒక తెర కట్టించి, దాని వెనక నుంచి, తల్లితో తానే విధంగా విష్ణుమూర్తికి ప్రియురాలయినదీ చెప్పేసింది.







ఏకాదశి నాడు స్వర్గద్వారాలు తెరుస్తారు. అప్పుడు శివుడి ప్రమథులు అనేకమంది స్వర్గం ప్రవేశిస్తారు. నీ తల్లి కూడా వారి లాగా వేషం వేసుకుంటే, నేను స్వర్గంలోకి ఎలాగో తోసేస్తాను. ప్రమథుల వేషం ధరించాలంటే నీ తల్లి తల గొరిగించుకుని, ముఖానికి ఒక పార్శ్వాన కాటుకా, రెండో పార్శ్వాన కుంకమూ పూసుకుని, సిద్ధంగా ఉండమను," అన్నాడు.

మర్నాడు రాత్రి అతను వచ్చేసరికి రూపణిక తల్లికి ఈ వికారాకారం కలిగించి సిద్ధంగా ఉంచింది. లోహజంఘు డామెను తన పక్షి మీద ఎక్కించుకుని అకాశంలోకి ఎగిరి ఆలయం వద్దకు వచ్చాడు. ఆ దేవాలయానికి ఎదురుగా ఒక ఎత్తయిన రాతి స్తంభమూ, దాని పైన గుండ్రని రాతి పలకా ఉన్నాయి. లోహజంఘుడు మకర దంష్ట్రను ఆ రాతిపలక మీద దించి, "నువ్విక్కడ ఒక్క క్షణంసేపు ఉండు. నేను నీ కూతుర్ని అనుగ్రహించి వస్తాను," అని అక్కడి నుంచి కదిలిపోయాడు.

ఏకాదశి రాత్రి దేవాలయం దగ్గిర అనేక మంది జాగరం చేస్తున్నారు. లోహజంఘుడు వారి వద్దకు వెళ్ళి, అకాశం నుంచి వారితో, "ప్రజలారా, ఇవాళ మీ పైన ఒక

కాని ముసలిది రూపణిక మాట నమ్మక, ఆ రాత్రి లోహజంఘుడు పక్షినెక్కి రావటం కళ్ళారా చూసిన మీదట నమ్మి, మర్నాడు ఉదయం తెర వెనక నుంచి కూతురితో, "అమ్మా, నువు నిజంగానే దేవతలలో చేరిపోయావు. నేను నీ తల్లినే గనక, నేను ఎలాగైనా బొందితో స్వర్గానికి వెళ్ళే ఉపాయం చెయ్యి. అందుకేం చెయ్యాలో నీ భర్త నడుగు," అని బతిమాలుకున్నది.

రాత్రి లోహజంఘుడు రాగానే రూపణిక తన తల్లి కోరిక అతనితో చెప్పింది.

"నీ తల్లి పాపాత్మురాలు. అందుచేత అది స్వర్గాన్ని దొంగవేషంతో ప్రవేశించాలి.

మహామారి పడబోతున్నది. మీ రంతా హరిని ఆశ్రయించండి," అని చెప్పి వెళ్ళిపోయాడు. తరవాత అతను తన వేషం విప్పేసి మామూలు రూపంలో ఆ జనం మధ్యకు తిరిగి వచ్చి అక్కడ జరగబోయేది చూడటానికి ఉండిపోయాడు.

ఎంతసేపు చూసినా ముసలిదానికి మళ్ళీ దేవుడు కనిపించలేదు. దానికి కళ్ళు తిరగసాగాయి. "అయ్యో, పడుతున్నాను, పడుతున్నాను," అని కేకలు పెట్టసాగింది.

ఈ కేకలు విని జనం, "మహామారి! మహామారి!" అని అరిచారు. "అమ్మా, తల్లీ! నువు పడ వద్దు!" అని తిరిగి కేకలు పెట్టారు. మకరదంష్ట్ర ఎలాగో తెల్లవార్లూ ఆ రాతి పలకను కరుచుకుని ఉన్నది.

తెల్లవారే సరికల్లా రాజుగారికి ఈ వార్త తెలిసింది. పగటివెలుగు రాగానే జనానికి మహామారి భయం పోయింది. అంతేగాక వాళ్ళు వికారరూపంలో ఉన్న మకరదంష్ట్రను గుర్తించి గొల్లున నవ్వుతూ, వేళాకోళం చెయ్యసాగారు.

తన తల్లి ఇంకా స్తంభం మీద ఉన్న సంగతి రూపణికకు తెలిసింది. ఆమె వచ్చి తల్లిని కిందికి దింపించి, అక్కడి వారితో జరిగిన దంతా చెప్పింది.

"ఎంతో మందిని మోసం చేసిన ఈ మకరదంష్ట్రను ఎవడైతే మోసగించాడో వాడు తనను తాను తెలియబరచుకున్నట్టయితే వాడికి పట్టాభిషేకం చేస్తాను," అన్నాడు రాజు.

లోహజంఘుడు ముందుకు వచ్చి తానే ఈ నాటకం ఆడినట్టు రాజుకు తెలిపి, తన కథ అంతా చెప్పి, విభీషణుడు దేవుడి కోసం పంపిన శంఖచక్రగదాదులు ప్రదర్శించాడు. రాజు అతనికి పట్టాభిషేకం చేసి, రూపణికను అతని కిచ్చి పెళ్ళి చేశాడు. లోహజంఘుడు తాను లంక నుంచి తెచ్చుకున్న రత్నాలతో నిశ్చింతగా జీవించాడు.





# పెళ్ళి మాటలు

చాలావందల ఏళ్ళక్రితం కాశ్మీరుదేశంలోని ఒక నగరం సమీపంలో ఒక కొండ గుట్ట మీద ఒక రాక్షసుడు పెద్ద భవంతి కట్టుకుని నివసిస్తూ ఉండేవాడు. అప్పట్లో అలాటి రాక్షసులు ప్రపంచమంతటా అక్కడక్కడా ఉండేవారు. రాక్షసులకు మెదడు చిన్నదయినా విపరీతమైన బలం ఉండటంచేత, వాళ్ళు మామూలు మనుషులను భయపెట్టీ, దౌర్జన్యం చేసీ శ్రమలేని, జీవితాలు గడుపుతూ, ఎదురులేకుండా, ఎవరికీ భయపడకుండా జీవించగలిగేవాళ్ళు. ఎవరన్నా బుద్ధి తక్కువచేత రాక్షసులను ఎదిరించినట్టయితే వాళ్ళకు వెంటనే ఆయువు చెల్లిపోయేది. క్రమంగా ఈ రాక్షసులు ఒక్కొక్కరే అంతరించి పోయారు. వారిని నిర్మూలించినది చాలావరకు యుక్తిపరులే.

ఈ కాశ్మీరు రాక్షసుడు దౌర్జన్యంతో చుట్టుపక్కల వాళ్ళను బెదిరించీ, దోచీ అంతులేని బంగారమూ, వస్తువులూ సంపాదించాడు. వాడి ఇంటికి వెళ్ళే అవకాశం దొరికినవాళ్ళు, వాడి ఇంట లక్ష్మి మూలుగుతున్నదని చెప్పేవాళ్ళు. ఈ రాక్షసుడు లోకులను కొల్లగొట్టినా, అప్పుడప్పుడూ మనుషులను చంపినా నగరవాసులకు అంత బాధ కలగలేదుగాని, వాడు వున్నట్టుండి నగరంలోకి వచ్చి, "మీ అమ్మాయిని నాకిచ్చి పెళ్ళి చెయ్యండి," అని ఎవరినో ఒకరిని కోరేవాడు. ఇవ్వమనటానికి లేక ఒప్పుకుని పెళ్ళి చేస్తే, ఆ పెళ్ళాం ఎంతో కాలం బతికేదికాదు. రాక్షసుడు మరొక పెళ్ళాం కోసం వచ్చేవాడు. ఇది నగరంలో వాళ్ళకు, అందులోనూ ప్రత్యేకించి పెళ్ళి కాని కన్యలకు, పెద్ద పీడ అయికూర్చున్నది.

ఈ విధంగా ఇరవైనలుగురు భార్యలను పోగొట్టుకున్న అనంతరం రాక్షసుడు ఇరవై అయిదోసారి పెళ్ళాడగోరి నగరానికి బయలు

ఆర్. సుందరరావు

దేరాడు. ఒక పేద రైతు పొలంలో పనిచేసు కుంటున్నాడు. రాక్షసుడు ఆ రైతును సమీ పించి, "నాకు మీ అమ్మాయినిచ్చి పెళ్ళి చెయ్యి," అన్నాడు. రైతుకు మతిపోయింది. అతనికి మల్లిక అనే ఒక కూతురున్నది. ఆ పిల్లకు పెళ్ళి ఈడువచ్చి కొంతకాల మయింది. కాని పేదవాడు కావటంచేత తండ్రి మల్లికకు ఇప్పటిదాకా పెళ్ళి చేయ లేకపోయాడు.

"నేను ఎల్లుండి రాత్రి మీ ఇంటికి భోజ నానికి వస్తున్నాను. అప్పుడు పెళ్ళి మాటలు మాట్లాడుకుందాం," అని చెప్పి రాక్షసుడు తన ఇంటికి వెళ్ళిపోయాడు.

రైతు ఇంటికి వచ్చి రాక్షసుడన్నది చెప్పి నప్పుడు మల్లిక ఏమాత్రమూ కలవరపడ లేదు. "నేను చెప్పినట్టుచేసి, అనమన్నట్టు అను. రాక్షసుడు మన సంబంధం వదులుకో వచ్చు, ఒక వేళ వదులుకోకపోయినా నీ దరిద్రం తీరిపోవటం మాత్రం ఖాయం," అన్నదామె తండ్రితో.

మల్లిక సలహాపైన ఆమె తండ్రి తన దగ్గిర ఉన్న డబ్బంతా ఖర్చుచేసి బోలెడన్ని వంట కుందేళ్ళనూ, ఒక పీపా ద్రాక్షసారా యినీ సంపాదించాడు. మల్లిక ఇరుగు పొరుగు ఇళ్ళకు వెళ్ళి, వందలకొద్దీ నేత



బట్టలను అరువుతెచ్చి, వాటిని గోడలవెంబడి అరలలో పేర్చిపెట్టింది. రాక్షసుడు భోజ నానికి వచ్చేరోజున, పెద్ద అండా నిండా కుందేళ్ళ మాంసం ఇగురు రుచిగా చేసింది. రాక్షసుడు భోజనానికి కూర్చునే చోట ఒక పక్కన కూర అండా, రెండో పక్కన సారా పీపా ఏర్పాటు చేసింది.

రాక్షసుడు వచ్చాడు, భోజనానికి కూర్చు న్నాడు. కూర దివ్యంగా ఉన్నది.

"నాకోసం, పాపం, మీకు చాలా ఖర్చయి ఉండాలి, నేను కాస్త తిండిపుష్టిగలవాణ్ణీ, భోజనప్రియుణ్ణీ కూడానూ," అన్నాడు రాక్షసుడు.

"దానిదేముందిలెండి? ఎలక లున్నంత కాలమూ ఖర్చేముంటుంది? ఎలకలు చాలక పోతే పిండి కొంచెం జాస్తిచేస్తే సరిపోయె," అన్నది మల్లిక.

"ఎలకలతో ఇంత రుచిగా వండావా? నేను కట్టుకున్న తప్పుడుముండల్లో ఒక్కతె కూడా ఎలకలను వండిన పాపాన పోలేదంటే నమ్ము," అన్నాడు రాక్షసుడు, తన కాబోయే భార్య పొదుపును మనసులో మెచ్చుకుంటూ. వాడు పైకి, "నీకు నేత కూడా వచ్చుననుకుంటాను?" అన్నాడు.

మల్లిక తన చేతిగుడ్డ పట్టుకున్న చెయ్యి బారచాచి, "ఇదంతా నేను కిందటి నెల వడికి తయారు చేసినదే," అని చెప్పింది. ఆమె చెయ్యి, చుట్టూ అమర్చిన బట్టల దొంతర్ల కేసి చాచి ఉండటంచేత ఆ బట్ట లన్నీ మల్లికే వడికి, నేసిందనుకున్నాడు రాక్షసుడు. వాడికి మల్లిక మీద కలిగిన సద్భావం రెట్టింపయింది. వాడు తినటం పూర్తిచేసి సారా ఒక లోటాడు తాగి, "చాలా బాగుంది. దీనికైనా డబ్బు బాగా ఖర్చు అయి ఉండాలే?" అన్నాడు రైతుతో.

"ఖర్చేముందీ? కుళ్ళిపోయిన పళ్ళు సారా తీయటానికి తప్ప మరెందుకూ పనికి రావుగా. దాని విషయం మా మల్లికే చూసుకుంటుంది," అన్నాడు రైతు.



"కుళ్ళిన పళ్ళ నుంచి ఇంత మంచి సారా వస్తుందని నాకు తెలియనే తెలియదు. మేం వాటిని పందులకు వేస్తాం. మల్లిక కాపరానికి వచ్చాక ఆ పద్ధతి మార్పిం చేస్తాను. అయితే మల్లికతో బాటు మీరు కట్నం ఏపాటి ఇవ్వబోతున్నారు?" అన్నాడు రాక్షసుడు.

"మల్లికే పెద్ద కట్నం. ఇంక వేరే కట్నం కూడానా? అది కాపరానికి వెళ్ళిపోతే నాకు చాలా నష్టం వస్తుంది. అందుచేత దాన్ని చేసుకోబోయేవాడు నాకే పెద్ద మొత్తం ఇవ్వ వలిసి ఉంటుంది. ఈ వూరి పెద్ద షావుకారు భార్య పోయిందిగా? మళ్ళీ పెళ్ళి చేసుకుందా మన్న ఆలోచనలో ఉన్నాడు. మల్లికనిస్తే, కోరినంత ఇస్తానని అక్కడా అక్కడా అన్నాడు కూడానూ," అన్నాడు రైతు.

రాక్షసుడికి కోపంవచ్చి, "నాతోనే అంటు న్నావా ఈ మాట? నేను నీ కూతుర్ని బల వంతాన ఎత్తుకుపోయి పెళ్ళాడితే నన్ను నువు ఆపగలవా?" అన్నాడు.

"అంటే, మీకు మల్లిక సంగతి ఏమీ తెలీదన్నమాట. అది మహా మకురుమనిషి. మొండికేసిందంటే, ముక్కలుముక్కలుగా నరికినా సరే ఏ పనీ చేయదు, మంచిగా దాని చేత పనులు చేయించుకోవలిసిందేగాని," అన్నాడు రైతు.






"సరే, సరే," అంటూ రాక్షసుడు తాను రైతుకు ఇవ్వాలనుకున్న మొత్తం చెప్పాడు.

"చాలదు. దానికి రెండింతలైతేనే పని జరుగుతుంది," అన్నాడు రైతు.

రాక్షసుడు ఆలోచించాడు. మల్లిక కోసం తాను ఇచ్చేది తిండి కిందా, తాగుడు కిందా త్వరలోనే ఆదా అయిపోతుంది. ఎంత ఇచ్చినా నష్టం ఉండదు. ఇలా అనుకుని రాక్షసుడు తాను మొదట ఇస్తానన్న దానికీ, రైతు అడిగినదానికీ మధ్యగా ఇంకో మొత్తం చెప్పాడు. రైతు రాజీపడి ఒప్పుకున్నాడు. అతను యావజ్జీవమూ సుఖంగా బతకటానికా డబ్బు చాలును.

"సరే, రేపు ఆ డబ్బు తెచ్చిఇచ్చి మల్లికతో మాట్లాడండి. అది ఇప్పుడు పడుకుని నిద్రపోతున్నది," అన్నాడు రైతు.

మర్నాడు ఉదయం రాక్షసుడు సంచీలో డబ్బు తెచ్చి రైతుకిచ్చాడు. మల్లిక వాడితో మాట్లాడుతూ, "నన్ను పెళ్ళిచేసుకునేవాడు నా కోరికలు రెండు చెల్లించాలి. కాపరం పొదుపుగా జరగగలందులకు నా కొక కొత్త ఇల్లు, నేను చెప్పిన మోస్తరుగా కట్టించి ఇవ్వాలి. రెండోదేమంటే, ముసలమ్మ బాతుల ఈకలు పీకేటప్పుడు తాజా ఈకలతో నాకొక పరుపు తయారుకావాలి. నేను సుఖంగా నిద్రపోనిదే, కష్టించి పని చెయ్యలేను," అన్నది.

"ఇంకా నగానట్రా అడగలేదు, నయం," అనుకున్నాడు రాక్షసుడు. మళ్ళీ మనుషులనుపెట్టి కట్టిస్తే కూలి డబ్బులు దండగ అని, రాక్షసుడు మల్లిక కోరిన ఇంటిని, ఆమె చెప్పే విధంగా తానే కట్టాడు.

ఇంతలో శీతాకాలం వచ్చింది. మల్లిక పరుపు కోసం గుడ్డను సంచీరూపంలో తయారుచేసి, మంచు పడటం కోసం వేచి ఉన్నది. మంచు పడటం ప్రారంభంకాగానే ఆ ప్రాంతాలవాళ్ళు, "ముసలమ్మ బాతుల ఈకలు పీకుతున్నది," అంటారు.



త్వరలోనే మంచు కూడా పడసాగింది. "బాతు ఈకలు రాలుతున్నాయి. ఏరుదువు గాని రా," అని మల్లిక రాక్షసుడికి కబురు చేసింది. వాడు వచ్చి, మంచు పడుతూం డటం చూసి, "ఎలా ఏరటం?" అన్నాడు.

"మందమతీ, పార తీసుకొచ్చి ఈకలు ఎత్తి నా సంచీలో వెయ్యి," అన్నది మల్లిక.

రాక్షసుడు మంచును పారతో ఎత్తి పరుపు సంచీలో వేస్తుంటే సగానికి సగం అప్పటి కప్పుడే కరిగిపోతూ వచ్చింది. ఎలాగైతేనేం, సాయంకాల మయేటప్పటికి సంచీ నిండింది. మల్లిక సంచీమూతి కుట్టేసి, ఆ మంచు పరుపు మీద దుప్పట్లు పరిచి, "ఈ రాత్రికి దీనిమీదనే పడుకుని ఎంత సుఖంగా ఉంటుందో చూడు. రేపు మనం పెళ్ళా డేద్దాం," అన్నది.

అలిసి ఉన్న రాక్షసుడు ఆ మంచు పరుపు మీద పడుకున్నాడు. వాడు ఎంత ప్రయత్నించినా ఒంటికి వెచ్చదనం మటుకు కలగలేదు. పరుపు మీద పరిచిన దుప్పట్లు తడిగా ఉన్నట్టుకూడా వాడికి తోచింది.

మర్నాడు తెల్లవారి లేచేసరికి రాక్షసుడి శరీర మంతా తీవ్రంగా బాధపెడుతున్నది. ఎముకల దగ్గిర నుంచీ సలుపుతున్నాయి. కదలటానికి కూడా వాడికి తగని బాధగా ఉన్నది. పరుపేమో సగం కరిగి పోయింది.





"లాభంలేదు. మల్లిక సమర్థురాలేగాని, ఇటువంటి పరుపు మీద పడుకుంటే నాకు చావు తప్పదు," అనుకుని రాక్షసుడు చేత నైనంత శీఘ్రంగా ఇంటికి వెళ్ళిపోయాడు. మల్లిక వచ్చి, "పెళ్ళిచేసుకుందాం పట్టు," అంటుందేమోనని వాడికి హడలు పుట్టు కొచ్చింది.

రాక్షసుడు వెళ్ళిపోయాడని తెలియగానే మల్లిక రాక్షసుడి ఇంటికి తన తండ్రిని పంపింది. రైతు రాక్షసుడి ఇంటికివెళ్ళి, పెళ్ళికూతురు కనిపెట్టుకుని ఉన్నదని లోపలికి కబురు చేశాడు.

"నాకు ఒంట్లో బాగాలేదు. పెళ్ళాడ లేనని చెప్పు," అని రాక్షసుడు రైతుకు తన నౌకరు ద్వారా జవాబు పంపాడు.

ఆ నౌకరు తిరిగి వచ్చి, "వాళ్ళమ్మాయికి ఆశాభంగం కలిగించి నందుకు పరిహారం ఏమిచ్చుకుంటావో అడగమంటున్నాడు రైతు," అన్నాడు.

"కట్నం ముందుగానే ఇస్తిని, ఈకల పరుపి స్తిని. ఇంకేం కావాలిట?" అన్నాడు రాక్షసుడు.

"నువు ఈకల పరుపును అప్పచ్చిలా చేశావుట. ఇంకొన్ని బాతు ఈకలు ఏరి పెట్టాలిట," అన్నాడు నౌకరు తిరిగివచ్చి.

"మన దొడ్లో ఉన్న బాతులన్నిటినీ తోలుకుపోయి ఏ గంగలోనన్నా దూకమను. మారు మాట్లాడితే విరుచుకు తింటానని చెప్పు," అన్నాడు రాక్షసుడు తన నౌకరుతో.

ఈ మాట రైతు చెవినపడిన మరుక్షణం అతను బయలుదేరి, వెళుతూ వెళుతూ రాక్షసుడి బాతులన్నిటినీ తోలుకుపోయాడు.

రాక్షసుడు ఈకలపరుపు దెబ్బ నుంచి తిరిగి కోలుకోనే లేదు. వాడింకెవరి అమ్మాయినీ పెళ్ళాడతానని కూడా అనలేదు.

మల్లిక మాత్రం రాక్షసుడి డబ్బుతో స్థితి మంతురాలై, తనకు తగిన భర్తను సంపా దించుకుని, సుఖంగా జీవించింది.





# ప్రియతమవస్తువు

ఒకసారి అక్బరుపాదుషాకు తన బేగము లలో ఒకతె పైన ఎందుకో ఆగ్రహం వచ్చింది. ఆగ్రహావేశంలో ఆయన, ఆ బేగముకు తన రాజభవనం నుంచి పుట్టింటికి వెళ్ళిపొమ్మని ఉత్తరు విచ్చాడు.

ఈ ఉత్తరువుతో బేగమ్ హతాశురాలై, బీర్బల్‌ను పిలిపించి, అతనితో జరిగిన దంతా చెప్పింది. బీర్బల్ చాలా సేపు దీర్ఘంగా ఆలోచించి, చివరకు ఒక ఉపాయం చెప్పి, వెళ్ళిపోయాడు.

బేగమ్ తన సామాను లన్నీ నౌకర్ల చేత కట్టించి, సెలవు పుచ్చుకునే నిమిత్తం పాదుషాకు కబురు పంపి, ఆయన కోసం షర్బత్ తయారు చేసి ఉంచింది. అక్బరు వచ్చాడు. ఆమె తనను క్షమించ మని మరొకసారి పాదుషాను ప్రార్థించింది.

"నా ఆజ్ఞకు తిరుగు లేదు. దాని ప్రకారం జరగవలిసిందే. అయితే ఒక్క అవకాశం ఇస్తాను—రాజభవనంలో నీకు ప్రియతమమైన వస్తువు ఏదైనా ఉంటే, దాన్ని తీసుకుపోవచ్చు," అన్నాడు అక్బరు.

"నా అదృష్టం అలా ఉన్నది. మీ యిష్ట ప్రకారమే కానివ్వండి. కాని ఒక్క మనవి. నాకు ఈ జన్మలో మీకు సేవ చేసే భాగ్యం లభిస్తుందో, లభించదో! నా చేతి మీదుగా మీకు షర్బత్ ఇస్తాను, స్వీకరించండి," అన్నది బేగమ్.

బీర్బల్ సహాయంతో ఆమె పన్నిన ఉచ్చులో పడి పాదుషా సరే నన్నాడు. తాను సిద్ధంగా ఉంచిన షర్బతును ఒక లోటాలో పోసి బేగమ్ పాదుషా కిచ్చింది. పాదుషా, దాన్ని తాగేశాడు. అందులో మత్తు మందు ఉన్నందున పాదుషాకు త్వరలోనే నిద్ర ముంచుకు వచ్చింది.

బేగమ్ తన చెలికత్తెల సహాయంతో పాదుషాను, తన కోసం సిద్ధంగా ఉన్న

బి. సూర్యనారాయణ

మేనాలలో ఒకదానిలో పడుకోబెట్టించి, తాను మరొక మేనాలో ఎక్కి, తన పుట్టింటికి బయలుదేరింది. అప్పటికి చీకటి పడింది. వాళ్ళు తెల్లవార్లూ ప్రయాణం చేసి, ఉదయాని కల్లా బేగమ్ తండ్రిగారి ఇంటికి చేరారు. అక్బరును తన తండ్రి మహలులో ఉండే ఒక అందమైన గదిలో బేగమ్ పడుకో బెట్టించింది.

కొంత సేపటికి పాదుషాకు మత్తు వదిలి, మెలకువ వచ్చింది. తాను ఎక్కడో కొత్త చోట ఉన్నట్టు ఆయన తెలుసుకున్నాడు. ఇంతలో బేగమ్ అక్కడికి వచ్చింది.

"నేను మేలుకుని ఉన్నానా, కల గంటున్నానా?" అన్నాడు పాదుషా.

"పూర్తిగా మేలుకునే ఉన్నారు. వెంటనే ముఖం కడుక్కుని, ప్రార్థన చేసుకోండి," అన్నది బేగమ్.

"ఇది మన రాజభవనం లాగా లేదే? మనం ఉన్నదెక్కడ?" అన్నాడు పాదుషా.

"ఇది మా తండ్రిగారి భవనం. నన్నిక్కడికి వెళ్ళిపొమ్మని మీరు ఉత్తరు విచ్చారు గద?" అన్నది బేగమ్.

"అది నిజమే గాని, నే నిక్కడ ఎందు కున్నాను?" అని పాదుషా అడిగాడు.

"మరిచిపోయారా? నన్ను ప్రియతమ మైన వస్తువు వెంట తీసుకుపొమ్మన్నారు గద! నాకు మీ కన్న ప్రియతమమైనది వేరే ఏమున్నది? అందుకని మిమ్మల్ని వెంట తెచ్చుకున్నాను," అన్నది బేగమ్.

బేగమ్ పన్నిన యుక్తికి అక్బరు సంతో షించి, ఆమెకు తనపై గల ప్రేమకు ముగ్ధు డయాడు. ఆయన తన మామగా రింట కొద్దిరోజు లుండి, ఢిల్లీకి తిరిగి వస్తూ బేగమును కూడా వెంటబెట్టుకుని వచ్చాడు.

ఇది జరిగాక బేగమ్ పాదుషాతో, తన కీ యుక్తి చెప్పినవాడు బీర్బల్ అన్న మాట బయట పెట్టింది. పాదుషా బీర్బల్‌కు బహిరంగంగా గొప్ప సన్మానం చేశాడు.






రాముడు శంబూకుణ్ణి చంపి, అయోధ్యకు తిరిగి వస్తూనే, ద్వారపాలకుడితో భరత లక్ష్మణులను తన వద్దకు పంపమని చెప్పాడు. వారు త్వరలోనే రాముడి వద్దకు వచ్చారు. వారితో రాముడు, "తమ్ములూ, అన్ని పాపాలనూ పోగొట్టే రాజసూయం చేద్దామనుకుంటున్నాను. పూర్వం మిత్రుడూ, చంద్రుడూ రాజసూయం చేసే శాశ్వతమైన కీర్తి గడించారు. అందుకు మీ సలహా ఏమిటి?" అని అడిగాడు.

దానికి భరతుడు, "అన్నా, నీ ధర్మానికీ, కీర్తికీ లోటేమున్నది. రాజసూయం చేశావంటే అనేక రాజవంశాలు నాశనమవుతాయి, పౌరుషం కొద్దీ అనేకమంది రాజులు నశిస్తారు. అందుచేత రాజసూయం చేసి, భూమికి లేనిపోని సంక్షోభం కలిగించవద్దు," అన్నాడు.

భరతుడన్న మాట రాముడికి నచ్చింది. మంచి సలహా ఇచ్చినందు కతను భరతుణ్ణి మెచ్చుకున్నాడు.

అప్పుడు లక్ష్మణు డిలా అన్నాడు: "అన్నా, సమస్త పాపాలనూ పోగొట్టే మహా యజ్ఞం అశ్వమేధం. వెనక ఇంద్రుడు తనకు మహాపాతకం చుట్టుకోగా, బృహస్పతి సహాయంతో, అశ్వమేధం ద్వారా ఆ పాపాన్ని పోగొట్టుకున్నాడు."

లక్ష్మణుడా వృత్తాంతాన్ని ఈ విధంగా చెప్పాడు:

పూర్వం వృత్రుడనే గొప్ప రాక్షసుడుండేవాడు. అతను మహాధర్మపరుడు,



గొప్పజ్ఞాని; మూడులోకాలనూ ఎంతో ప్రేమగా చూసుకుంటూ, ధర్మం తప్పకుండా పాలించాడు. అతని పాలనలో భూమి అన్ని కోరికలనూ తీర్చేది, దున్నకుండానే పండేది, పూలూ, పళ్ళూ, కాయలూ రసవంతంగా ఉండేవి.

ఇలా ఉండగా వృత్రుడికి తపస్సు చేయాలని సంకల్పం కలిగింది. అతను తన పెద్దకొడుక్కు రాజ్యం అప్పగించి ఉగ్రమైన తపస్సు ప్రారంభించాడు. ఆ తపస్సు చూసి దేవేంద్రుడు బెదిరిపోయాడు. అతను విష్ణుమూర్తి వద్దకు వెళ్ళి, "వృత్రుడు అదివరకే మూడు లోకాలనూ జయించాడు. ఇప్పుడు తపస్సు కూడా ప్రారంభించాడు. ఈ తపస్సు పూర్తి అయిందంటే లోకాలుండేటంత కాలమూ అతన్ని నేను జయించలేను. అందుచేత నువు ఆ వృత్రుణ్ణి కడతేర్చితే గాని నాకూ, దేవతలకూ దిక్కులేదు," అన్నాడు.

దేవతల పక్షాన ఇంద్రుడు ఇలా మొర పెట్టుకోగా, విష్ణుమూర్తి, "మహాత్ముడైన వృత్రుడు నాకు స్నేహితుడు. అందుచేత నే నతన్ని చంపను. అయితే నీ కోరిక కూడా తీసివెయ్యటానికి లేదు. అందుకని వృత్రుడు చచ్చే ఉపాయం ఒకటి చేస్తాను. నా శక్తిని మూడు భాగాలు చేసి, ఒకభాగం నీ లోనూ, ఒకటి వజ్రాయుధం లోనూ, మూడవదాన్ని భూమి లోనూ, ప్రవేశ పెడతాను. అప్పుడు నువు వృత్రుణ్ణి చంపగలుగుతావు," అన్నాడు.

ఈ మాటలు విని ఇంద్రుడూ, దేవతలూ సంతోషించి, వృత్రుడు తపస్సు చేసుకునే వనానికి వెళ్ళారు. తపశ్శక్తి చేత మూడులోకాలనూ దహించేటట్టుగా వెలిగిపోతూ వృత్రుడు వారికి కనిపించాడు. అతన్ని చూస్తేనే దేవతలకు దడపుట్టింది. ఇంద్రుడు తన వజ్రాయుధాన్ని రెండు చేతులా పట్టి వృత్రుడి తలను తెగవేశాడు.





వెంటనే బ్రహ్మహత్య ఇంద్రుడి శరీరాన్ని చుట్టుకున్నది. అతనికి తీరని దుఃఖం పుట్టుకొచ్చింది. అప్పుడు దేవతలు విష్ణువుతో, "దేవా, నువ్వేమో వృత్రుణ్ణి చంపావు; బ్రహ్మహత్య ఇంద్రుణ్ణి చుట్టుకున్నది. అది వదిలే ఉపాయం చెప్పు," అని మొరపెట్టుకున్నారు.

"ఇంద్రుడు అశ్వమేధం చేసినట్టయితే బ్రహ్మహత్య తొలగిపోయి అతడు ఎప్పటి దేవేంద్రు డవుతాడు," అని విష్ణుమూర్తి దేవతలకు చెప్పాడు.

ఈ సలహా విని దేవతలు బృహస్పతి మొదలైన మునులను వెంటబెట్టుకుని ఇంద్రుడున్న చోటికి వెళ్ళారు. ఇంద్రుడు తెలివి పూర్తిగా పోయి, భయభ్రాంతుడై ఒక చోట పడి ఉన్నాడు. ఆ ఇంద్రుణ్ణి వెంట ఉంచుకుని దేవతలు అశ్వమేధయాగం చేసిన మీదట, అతన్ని బ్రహ్మహత్య వదలి పోయింది.

లక్ష్మణు డీ కథ చెప్పిన మీదట రాముడు అశ్వమేధం యొక్క మహిమను తెలిపే మరొక కథ చెప్పాడు.

పూర్వం కర్దమప్రజాపతి కొడుకు ఇలుడు బాహ్లికదేశాన్ని పరిపాలించేవాడు. అతనంటే దేవతలకూ, రాక్షసులకూ, నాగులకూ, యక్షులకూ గంధర్వులకూ, ఎంతో గౌరవం వుండేది.

ఒక చైత్రమాసంలో ఇలమహారాజు తన పరివారాన్ని వెంటబెట్టుకుని అడవికి వేటకు వెళ్ళాడు. ఎన్ని వేల మృగాలను చంపినా అతనికి వేటతమకం తీరలేదు. అందుచేత అతను వేటాడుతూ పోయిపోయి, కుమారస్వామి పుట్టిన చోటికి వెళ్ళాడు. అక్కడ పార్వతీ పరమేశ్వరులూ, వాళ్ళ అనుచరులూ ఉన్నారు.

ఆ పర్వత ప్రదేశంలోగల విశేష మేమిటంటే, అక్కడ చెట్లూ, పక్షులూ, జంతువులూ కూడా ఆడవే.





అక్కడికి చేరుతూనే, ఇలుడూ, అతని భృత్యులూ కూడా స్త్రీలుగా మారిపోయారు. తనలో కలిగిన మార్పు చూసి ఇలుడికి బాధా, భయమూ పుట్టాయి. అతను శివుడి దగ్గిరకు వెళ్ళి స్తోత్రం చేసి, కాళ్ళపైన పడి రక్షించమన్నాడు.

"నీ అడతనం పోగొట్టటం తప్ప ఇంకే మైనా కోరుకో," అన్నాడు శివుడు.

ఇలుడు శివుణ్ణి మరొక వర మేదీ కోరక, పార్వతిని ప్రార్థించాడు. పార్వతి అతనిపై జాలిపడి, అతను ఒక నెల స్త్రీగానూ, మరొక నెల పురుషుడుగానూ ఉండేటట్టూ, స్త్రీగా ఉండేటప్పుడు జరిగేది పురుషుడుగా ఉండే టప్పుడు జ్ఞాపకం లేకుండానూ వర మిచ్చింది.

ఇలుడు కాస్తా ఇలగా మారింది. అతని సైనికు లందరూ స్త్రీలే అయారు. వారందరూ యథేచ్ఛగా ఆ అడవిలో తిరగ సాగారు.

వాళ్ళు స్త్రీలుగా మారిన కొండకు సమీపంలోనే ఒక సరస్సున్నది. అక్కడనే చంద్రుడి కొడుకైన బుధుడు ఆశ్రమం కల్పించుకుని, తపస్సు చేసుకుంటున్నాడు. అతను మంచి యౌవనంలో ఉండి, ఆకర్షణీయంగా ఉన్నాడు.

ఇలా, ఆమె వెంట ఉన్న స్త్రీలూ సరస్సులో దిగి, దాన్ని కల్లోలం చెయ్య సాగారు. బుధుడు వారిని చూసి, ఇల సౌందర్యం చేత సమ్మోహితు డయాడు. అంత అందమైన స్త్రీ మూడులోకాలలోనూ మరొకతె ఉండదని అతనికి తోచింది. ఇల వెంట ఉన్న స్త్రీలను కొందరిని అతను ఆశ్రమంలోకి పిలిచి, "ఆమె ఎవరు? ఈ ప్రాంతానికి ఏం పనిమీద వచ్చింది? నిజం చెప్పండి," అన్నాడు.

"అయ్యా, ఆమె మాకు నాయకురాలు. ఆమెకు భర్త లేదు. మమ్మల్ని వెంటపెట్టుకుని ఇలా అరణ్యమంతా తిరుగుతున్నది," అన్నా రా స్త్రీలు.

"మీ రంతా ఈ ఆశ్రమంలోనే కంద మూలాలు తింటూ ఉండిపొండి. ఇక్కడ ఉండే కింపురుషులు మీకు భర్తలౌతారు," అని బుధుడు వారితో అన్నాడు. వాళ్ళం దరూ వెళ్ళిపోయారు.

తరవాత బుధుడు ఇలతో, "నేను చంద్రుడి కొడుకును. నా పేరు బుధుడు. నన్ను భక్తిస్నేహలతో చూసుకుంటూ ఇక్కడే ఉండిపో," అన్నాడు.

"నీ యిష్టం," అన్నది ఇల.

ఇద్దరూ మహాసంతోషంగా ఆ నెల గడి పారు. ఒకనాడు ఉదయం ఇల కాస్తా, ఇలమహారాజై పక్కమీది నుంచి లేచాడు. అతనికి జరిగిన దేదీ జ్ఞాపకం లేదు. సరస్సులో బుధుడు చేతులు పైకెత్తి తపస్సు చేసుకుంటున్నాడు. ఇలు డతన్ని చూసి, "అయ్యా, నేను నా సైనికులతో ఈ పర్వత ప్రాంతానికి వేటకై వచ్చాను. వా రంతా ఎటు పోయారో తెలియకుండా ఉన్నది," అన్నాడు.

"రాజా, రాళ్ళవాన కురిసి, నీ పరివార మంతా నశించింది. నువు మాత్రం ఈ ఆశ్ర మంలో తలదాచుకున్నావు. విచారించకు. ఇక్కడ నువు సుఖంగా ఉండవచ్చు," అన్నాడు బుధుడు.



ఇలుడు తన అనుచరులు పోయినందుకు దిగులుపడుతూ, "నా కింక రాజ్యం ఏలాలని లేదు. మీరు అనుమతిస్తే నేను నా పెద్ద కొడుకైన శశిబిందుడికి పట్టం కట్టి, వెంటనే తిరిగి వస్తాను," అన్నాడు.

"ఇలమహారాజా, ఎందుకలా కలవర పడతావు? ఒక్క సంవత్సరం ఇక్కడ ఉండు. నీకు మేలు కలిగేటట్టు చేస్తాను," అన్నాడు బుధుడు. ఇలుడు సరేనన్నాడు.

ఒక నెలపాటు స్త్రీగా ఉండి మరొక నెలపాటు పురుషుడుగా ఉంటూ ఇలుడు తాను స్త్రీగా ఉన్న సమయంలో బుధుడికి ఒక కొడుకును కన్నాడు.



ఆటుతరవాత బుధుడు సంపద్దుష్టి, చ్యవనుష్టి, ప్రమోదనుష్టి, దుర్వాసుడు మొదలుగా గల ఇతర ఋషులనూ పిలిపించి, వారికి ఇలుణ్ణి పరిచయం చేసి, అతని పరిస్థితి యథాప్రకారం అయేటందు కమైనా దారి చెప్పమన్నాడు. ఈ సమయం లోనే ఇలుడి తండ్రి అయిన కర్దముడూ, మరికొందరు ఋషులూ కూడా అక్కడికి వచ్చారు. అందరూ ఇలుడికి తలొకసలహా ఇచ్చారు. కాని కర్దముడు, తన కొడుక్కు మేలు కలగాలంటే, అశ్వమేధ యాగం చెయ్యటమే మార్గమన్నాడు. ఆయన సలహా ప్రకారం అందరూ చేరి



అశ్వమేధయాగం చేసి, ఇలమహారాజుకు స్త్రీత్వం లేకుండా చేశారు. యజ్ఞం పూర్తి అయే సమయానికి శివుడే ప్రత్యక్షమై ఇల మహారాజును అనుగ్రహించాడు.

తరవాత ఇలుడు బాహ్లికదేశానికి తిరిగి వెళ్ళక, మధ్యదేశం లోని ప్రతిష్ఠానపురాన్ని ఏలుతూ, అక్కడే ఉండిపోయాడు. అతని కొడుకు శశిబిందుడు బాహ్లికదేశాన్ని పాలించాడు. ఇలకూ బుధుడికీ పుట్టిన పురూరవసుడు ఇలమహారాజు అనంతరం ప్రతిష్ఠాన పురానికి రాజయాడు.

రాముడీ కథ తన తమ్ములకు చెప్పి, లక్ష్మణుణ్ణి పంపి, తన పురోహితులైన వసిష్ఠ, వామదేవ, జాబాలి మొదలైన వారిని రప్పించి, తాను అశ్వమేధం తలపెట్టిన సంగతి వారికి తెలియజేశాడు. వారు చాలా సంతోషించారు.

అశ్వమేధానికి అవసరమైన ప్రయత్నాలు వెంటనే ప్రారంభమై చాలా చురుకుగా సాగాయి.

సపరివారంగా బయలుదేరి రావలిసిందనీ, యజ్ఞోత్సవంలో పాల్గొన వలిసిందనీ, లక్ష్మణుడు కిష్కింధలో సుగ్రీవుడికీ, లంకలో విభీషణుడికీ దూతల ద్వారా ఆహ్వానాలు పంపాడు. రాముడి మంచి



కోరే రాజు లందరికీ ఆహ్వానాలు వెళ్ళాయి. నానా దేశాల బ్రాహ్మణులూ, ఋషులూ, సకుటుంబంగా గృహస్థులూ, గాయకులూ, నటులూ, నర్తకులూ ఆహ్వానించబడ్డారు.

నైమిశవనంలో గోమతీ నదీతీరాన యజ్ఞశాల నిర్మించబడింది. వేలకొద్దీ బళ్ళతో ధాన్యమూ, అపరధాన్యాలూ, ఉప్పూ, గంధమూ చేరాయి. కోట్లకొద్దీ బంగారం వచ్చింది. వంటవాళ్ళూ, శిల్పులూ వచ్చారు. రాముడి అంతఃపురం నుంచి అతని తల్లులూ, బంగారుసీతా భరతుడి వెంట వచ్చి యజ్ఞం జరిగే చోటికి చేరారు. ఆహ్వానితులకు విడుదులు వేరువేరుగా ఏర్పాటు చేయబడ్డాయి.

ఈ ఏర్పాట్లన్నీ అయే లోపల రాముడు ఒక నల్లని గుర్రాన్ని విడిచి, దాని వెంట ఋత్విజులనూ, లక్ష్మణుణ్ణీ పంపాడు.

యజ్ఞం చూడవచ్చిన రాజులు రాముడికి కానుకలు తెచ్చారు. వారి సౌకర్యాలను భరతశత్రుఘ్నులు చూశారు. బ్రాహ్మణుల సౌకర్యాలను సుగ్రీవుడి వానరులూ, ఋషుల సౌకర్యాలను విభీషణుడి రాక్షసులూ చూశారు.

యజ్ఞం చాలా జయప్రదంగా జరిగింది. ఎక్కడా, ఎవరికీ, ఏ లోటూ కలిగిందన్న మాట పుట్టలేదు. భోజనాల దగ్గర ఎవరూ నోరు తెరిచి అడగకుండానే కావలిసిన పదార్థాలు వడ్డన అయాయి. బంగారమేమిటి, ధనమేమిటి, రత్నాలేమిటి, బట్టలేమిటి, ఎవరేమికోరినా ఇచ్చారు. ఈ వస్తువులన్నీ పెద్దపెద్ద కుప్పలుపోసి, రాత్రీ, పగలూ కూడా అడిగినవారికి ఇస్తూనే వచ్చారు. అలాటి యజ్ఞాన్ని ఇంద్రుడూ, కుబేరుడూ, యముడూ కూడా చేసి ఉండలేదని చెప్పుకున్నారు. వానరులకూ, రాక్షసులకూ చేతినిండా పనిపడింది. యాచకులు కోరినదల్లా వారే ఇస్తూవచ్చారు. ఇదేవిధంగా ఏడాదిగడిచి యజ్ఞం పూర్తి అయింది.





# అరణ్యపురాణం

## 2

షేర్‌ఖాన్ రంకె వేసి, "నా సొత్తు కోసం నేనీ కుక్క బొక్క దగ్గిర నిలబడాలా? షేర్‌ఖాన్ అంటే ఎవరో తెలుసా?" అన్నాడు.

తోడేలమ్మ ముందుకు వచ్చి, "రాక్షసి అనే బిరుదుగల నే నెవరో నీకు తెలుసా? మనిషికూన నాదిరా, సొట్టడా—నా సొంతం. వాడు చావటానికి వీల్లేదు. వాడు మందతో పరిగెత్తాలి, మందతో కలిసి వేటాడాలి. ఓరీ, కూసల్ని తినేవాడా, కప్పల్ని తినేవాడా, చేపల వేటగాడా! చివరకి వాడు నిన్నే వేటాడాలి. పోరా, కుంటుకుంటూ మీ అమ్మ దగ్గిరికి పో! ఫో!" అన్నది.

తోడేలయ్య నిర్ఘాంతపోయాడు. తనకు భార్య కాకమునుపే ఆమెకు మందలో రాక్షసి అనే బిరుదుండినమాట నిజం. తోడేలయ్యకు తట్టుకోవచ్చునేమోగాని తోడేలమ్మకు తట్టుకునే శక్తి తనకు లేదనీ, స్థానబలిమి ఆమె కున్నదనీ గ్రహించి షేర్‌ఖాన్ గుర్రుమంటూ తల వెనక్కు పీక్కుని, గుహ వెలపలి నుంచి, "దొడ్డి కుక్క దొడ్లో మొరగటానికేం? ఈ మనిషికూన పెంపకం గురించి మంద ఏమంటుందో నేమా చూస్తాను. ఆ కూన నాది, ఎప్పటికైనా నా నోటికి అంది తీరుతుందర్రా, జల్లితోక ముచ్చుల్లారా!" అని అరిచాడు.

"షేర్‌ఖాన్ అన్నది ఒకటి నిజం. ఈ కూనను మందకు చూపాలి. దాన్ని ఉంచుకుంటా నంటావా?" అన్నాడు తోడేలయ్య.

"ఉంచుకుంటానా! రాత్రి వేళ, నగ్నంగా, ఆకలితో వచ్చాడు; కాస్తయినా జంకలేదు! ఆ కుంటి కసాయి వీణ్ణి చంపి వాయిన్‌గంగకు పారిపోయి ఉండేవాడు. గ్రామస్తులంతా వాడి కోసం వెతుకుతూ మన

అట్ట చివరి బొమ్మ

ఇళ్ళన్నీ గాలించి పగ తీర్చుకునేవాళ్ళు. ఉంచుకోనా? తప్పక ఉంచుకుంటాను. కదలకురా, బుల్లి కప్పాయ్! ఏడికి మౌగ్లీ కప్పాయ్ అని పేరు పెట్టుకుంటాను. ఒరే మౌగ్లీ, నువు పెద్దయి నిన్నా షేర్‌ఖాన్ వేటాడినట్టు వాణ్ణి నువు వేటాడరా!" అన్నది తోడేలమ్మ.

"సరేలే, మన మంద ఏమంటుందో?" అన్నాడు తోడేలయ్య.

అరణ్య నియమాలప్రకారం పెళ్ళి చేసుకున్న తోడేలు తన మందను విడిచి వెళ్ళి వేరే కాపరం పెట్టవచ్చు, కాని అతని పిల్లలు కాళ్ళమీద లేచి నిలబడగలిగినప్పుడు, అతను వాళ్ళని మంద సదస్సుకు తేవాలి. ఆ సదస్సు నెల నెలా పౌర్ణమినాడు జరుగుతుంది. అప్పుడు ఇతర తోడేళ్ళు వాళ్ళను పరిచయం చేసుకుంటాయి. ఆ లాంఛనం తీరాక పిల్లలు స్వేచ్ఛగా తిరగవచ్చు. మందకు చెందిన పెద్ద తోడే లేదైనా ఆ పిల్లలను చంపటం జరిగితే హంతకుడు దొరికిన పక్షంలో మరణశిక్షే.

తన బిడ్డలు అటూ ఇటూ పరిగెత్తే దశ రాగానే తోడేలయ్య వాళ్ళనూ, మౌగ్లీనీ, తన భార్యనూ తీసుకుని, సదస్సునాటి రాత్రి సదస్సు కొండకు వెళ్ళాడు. దాని శిఖరం మీద అసంఖ్యాకమైన రాళ్ళూ, బండలూ





ఉన్నాయి; వాటి మధ్య వందల కొద్దీ తోడేళ్ళు దాక్కోవచ్చు.

ఈ తోడేళ్ళమందకు నాయకుడు అకేలా అనే ఒంటరి తోడేలు బలంలోనూ, యుక్తిలోనూ మేటి. అతను శిఖరం మీద అడ్డంగా పడుకున్నాడు. కొంచెం దిగువగా నలభైకి పైగా తోడేళ్ళు, అన్ని సైజుల వాళ్ళూ, రంగుల వాళ్ళూ కూర్చున్నారు. వారిలో లేడిని ఒంటరిగా పట్టగల సమర్థులూ, పట్టగల మనుకునే మూడేళ్ళ ముగ్ధులూ కూడా ఉన్నారు. అకేలా ఒక ఏడాదిగా ఈ మందకు నాయకత్వం వహిస్తున్నాడు. అతను యౌవనంలో రెండు సార్లు తోడేలు బోనుల్లో చిక్కాడు, మరొకసారి చావుదెబ్బలు తిని, చచ్చి బతికాడు. అతనికి మనుషుల ఆచార వ్యవహారాలు క్షుణ్ణంగా తెలుసు.

సదస్సులో పెద్దగా ప్రసంగా లేవీ జరగవు. తల్లిదండ్రులు వలయంలో కూర్చుని ఉంటే, మధ్యలో పిల్లలు పిల్లిమొగ్గలు వేస్తూ ఆడుకుంటారు. ఉన్నట్టుండి ఒక తోడేలువృద్ధుడు చప్పుడు కాకుండా వెళ్ళి ఒక పిల్లని పరీక్షగా చూసి, తిరిగి యథాస్థానంలో వచ్చి కూర్చుంటాడు. ఒక్కొక్కసారి ఒక తల్లి తన బిడ్డను నలుగురూ బాగా గమనించ గలందుకు బాగా వెన్నెల పడే చోటికి తోస్తుంది. శిఖరం మీది నుంచి



అకేలా, "తోడేళ్ళలారా, బాగా చూడండి. మీకు చట్టం తెలుసుగద!" అంటాడు. తల్లులు కూడా ఆదుర్దాగా ఆ మాటలే తాము కూడా అంటారు.

చిట్టచివరకు మౌగ్లీకప్పాయిని పరిచయం చేసే సమయం వచ్చింది. తోడేలమ్మ మెడ మీది రోమాలు నిక్కబొడుచుకున్నాయి. తోడేలయ్య కప్పాయిని మధ్యలోకి తోశాడు. కప్పాయి అక్కడ కూర్చుని నవ్వుతూ, వెన్నెలలో మెరిసే గులకరాళ్ళతో ఆడుకోసాగాడు.

అకేలా తన పాదాల మీద ఆనించిన తల ఎత్తకుండానే, "బాగా చూడండి! బాగా చూడండి!" అన్నాడు.

గుట్టల వెనకాల నుంచి గాండ్రింపు అస్పష్టంగా వినిపించింది. తరవాత షేర్‌ఖాన్ గొంతు ఇలా అన్నది: "ఆ కూన నాది. దాన్ని నా కివ్వండి. స్వతంత్ర ప్రజలకు మనిషికూనతో ఏం పని?"

అకేలా తన చెవులను కూడా కదపలేదు. అతనన్నాడు: "తోడేళ్ళలారా, బాగా చూడండి! స్వతంత్ర ప్రజలకు, స్వతంత్ర ప్రజల ఉత్తరువులతోనే గాని, పైవాళ్ళ ఉత్తరువులతో పనేమిటి?"

అనేక కంఠాలు ఒక్కసారిగా గాండ్రించాయి. ఒక నాలుగేళ్ళవాడు, షేర్‌ఖాన్ ప్రశ్ననే అకేలాకు వేస్తూ, "స్వతంత్ర ప్రజలకు మనిషికూనతో ఏం పని?" అని అడిగాడు.

అరణ్యంలో మరొక నియమమున్నది. ఒక కూనను మంద ఆమోదించటం గురించి అభిప్రాయభేదం కలిగినప్పుడు, మందకు సంబంధించిన వారు ఇద్దరు శిఫార్సు చెయ్యాలి; అలా శిఫార్సు చేసేవారు కూన యొక్క తల్లిదండ్రులై ఉండరాదు.

"ఈ కూనను ఎవరు శిఫార్సు చేస్తారు?" అని అకేలా అడిగాడు. —(ఇంకావుంది)



# 56. స్టోన్‌హెంజ్

ఇంగ్లండు లోని శాలిస్బరీ మైదానంలో ఉండే ఈ శిలలు క్రీస్తుకు పూర్వం 1700 ఏళ్ళ క్రితం నిర్మించినవి. స్టోన్‌హెంజ్ అంటే వేళ్ళాడే శిలలు అని అర్థం. సూర్యుడు ఉదయించే కోణాన్నిబట్టి ఋతువులు నిర్ణయించడానికి ఇది ఏర్పాటయిందని ఊహిస్తున్నారు. అడ్డంగా ఉండే రాళ్ళు నిలువుగా ఉండే శిలల పైన దిగబడటానికి వీలుగా చెక్కి ఉన్నాయి. ఒక్కొక్క శిలా 30 అడుగుల ఎత్తుండి, 50 టన్నులకు పైబడిన బరువు కలిగి ఉంటుంది. ఈ శిలలలో చాలా భాగం వేల్స్ నుంచి 180 మైళ్ళ దూరం తీసుకురాబడ్డాయి. మిగతా రాళ్ళు ఆ ప్రాంతంలోవే. అక్కడి శిలలను అక్కడే చెక్కి గుర్రపు లాడాల ఆకారంలో రెండు వరసల శిలలు తయారుచేశారు. వీటి మధ్యగా ఉండే శిలను "దేవుడి పీఠం" శిల అంటారు. స్టోన్‌హెంజ్ నిర్మించినవారు మధ్యధరా ప్రాంతంవారనీ, అగ్నిని ఆరాధించేవారనీ కొందరి నమ్మకం. ఈ శిలలు బరువైన రాతిసమ్మెటలతోనూ, చెకుముకి ఉలులతోనూ చెక్కబడ్డాయి.



Photo by C. R. Shah



. బహుమతి
పొందిన వ్యాఖ్య

రక్తిక వేణుగానము

పంపినవారు:
డి. ఎస్. రావు, హైద్రాబాదు

Chandamama, July '66

Photo by J. V. Sivarama Sastry



బహుమతి
పొందిన వ్యాఖ్య

భుక్తికి నాగస్వరము

పంపినవారు:
టి. ఎస్. రావు, హైద్రాబాదు

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1966 సెప్టెంబర్ నెల సంచికలో ప్రకటించబడును.





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగాని కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ జూలై నెల 20-వ తేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

### జూలై నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : రక్తికి వేణుగానము

రెండవ ఫోటో : భుక్తికి నాగస్వరము

పంపినవారు : డి. నరసింహారావు

న్యూ వల్లకుంట, హైదరాబాదు-13

బహుమతి మొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

**Printed by B. NAGI REDDI at The B. N. K. Press Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'**

# దిలీప్ బృందం



## వైకుంఠపాళీ ఆట







## ఫ్లాష్

అరే! దీపాలారి పోయాయే!

ఆట మంచి తమాషాగా వున్నప్పుడే ఆరిపోయాయే!

ఉండండి. నా 'ఎవరెడీ' తీసుకొస్తా. ఆట ఆడుకోవచ్చు.




ఈ 'ఎవరెడీ'తోనే తప్పక గెలుస్తా!



EWTUC 2927

# నాకు ఏమయింది చెప్మా?

నేను రోజంతా అలసిపోయి ఉండేదాన్ని. ఆ చిరాకుతో కస్సుబుస్సుమని అపర కాళిలా ఉండే నా దగ్గరకు ఎవరూ చేరేవారుకాదు.

నా అలసటకు కారణము మా డాక్టరు కనిపెట్టేరు. సరియైన పోషణ లేకపోతే యిలాగే అవుతుందన్నారు. నన్ను హార్లిక్స్ త్రాగమన్నారు

హార్లిక్స్ నాకు శక్తి ఉత్సాహములను కలిగించింది. నేను మళ్లీ మామూలు దాన్ని అయేను. హార్లిక్స్ చేసిన మేలు మరవలేను!

పూర్తిగా పోషణలేక నిరుత్సాహముగా ఉంటే డాక్టర్లు హార్లిక్స్‌ను సిఫార్సు చేస్తారు. పూర్తి మీగడగల పాలుతోను గోధుమపిండి, మాల్టెడ్ బార్లీల సారములుగల ఉడికిన హార్లిక్స్ త్వరలోనే శక్తి నిస్తుంది.

## హార్లిక్స్

అదనపు శక్తిని కలిగించును!

Horlicks



